Acc. No. 22201

ఓమ్

# శ్రీ గాయత్రీ శంకర భాష్యము

## ఆంధ్ర వివరణ సహితము



శ్రీ గాయత్రీదేవి


ర చ యి త :

ప. ప. శ్రీ శ్రీ చిదానంద భారతీస్వామి

శ్రీ భువనేశ్వరీ పీఠాధిపతులు, గన్నవరం



ప్ర కా శ కు లు :

శ్రీ సీతారామ ఆదిశంకర ట్రస్టు

హైదరాబాద్ - 500 047

# శ్రీగాయత్రీ శంకర భాష్యము

(ఆంధ్ర వివరణ సహితము)

శ్రీ సీతారామ దివ్యపాదపద్మములకు

అంకితము

తొలి ముద్రణ 1989

ప్రతులు : 1000

మూల్యము : 20/-

ముద్రణ :

బృందావన్ ప్రింటర్స్

భాస్కరపురం, మచిలీపట్టణము

ఫోన్ 2832

ప్రాప్తి స్థానము-ప్రకాశకులు :

శ్రీ సీతారామ ఆది శంకర ట్రస్టు

H. No. 24-141, ఆనంద్‌బాగ్, మల్కాజ్‌గిరి,

హైదరాబాద్ - 500 047.

# శ్రీగాయత్రీ శంకర భాష్యము

(ఆంధ్ర వివరణ సహితము)

శ్రీ సీతారామ దివ్యపాదపద్మములకు

అంకితము.

తొలి ముద్రణ 1989

ప్రతులు : 1000

మూల్యము : 20/-

ముద్రణ :

బృందావన్ ప్రింటర్స్

భాస్కరపురం, మచిలీపట్టణము

ఫోన్ 2832

ప్రాప్తి స్థానము-ప్రకాశకులు :

శ్రీ సీతారామ ఆది శంకర ట్రస్టు

H. No. 24-141, ఆనంద్‌బాగ్, మల్కాజ్‌గిరి,

హైదరాబాద్ - 500 047.

శ్రీ మచ్ఛంకరభగవత్పాదాచార్యులవారు సనాతనవైదిక ధర్మమును ఔపనిషదమగు అద్వైతాత్మతత్త్వమును భారతదేశమం దెల్లెడలను ప్రచారముచేసిన మహానుభావధౌరేయులు. తమ ముప్పది రెండు సంవత్స రముల జీవితావధిలో వారుచేసిన అనన్య సామాన్యములగు పనులు ఏ యితరవ్యక్తియు ప్రపంచ చరిత్రలోనే చేసియుండలేదు. వారు రచించిన ప్రస్థానత్రయభాష్యములు, అద్వైతసిద్ధాంతమునకు ప్రమాణమూర్ధన్యము లుగా విరాజిల్లుచున్నవి. ఇంతియేగాక వారు రచించిన లఘుప్రకరణములు, స్తోత్రములు పరమాద్భుతములుగా నున్నవి. మంత్రశాస్త్రమునందు వారు రచించిన "ప్రపంచసారతంత్రము" అనన్య సామాన్యముగా నున్నది. జగదుద్ధారమునకై అవతరించిన కైలాసవాసియగు సాక్షాత్ పరమ శివుఁడే వారు కావున ఈపనులు వారికి సాధ్యమైనవి.

వారు రచించిన గ్రంథము లన్నింటిని మాపరమేష్ఠిగురువులగు జగద్గురు శ్రీశ్రీశ్రీ సచ్చిదానందశివాభినవనృసింహభారతీ మహాస్వామివారి యాజ్ఞతో శ్రీరంగం వాస్తవ్యులగు శ్రీ టి. కె. బాలసుబ్రహ్మణ్యం అయ్యర్ గారు సుమారు ఏనుబది సంవత్సరములకు పూర్వము అచ్చొత్తించి ఆస్తికలోకమునకు మహోపకారమొనర్చినారు. తర్వాత ఇటీవల "సమతా పబ్లిషర్స్"వారు అవే గ్రంథములను మాగురువులవారియాజ్ఞతో మరల వెలుగునకు దీసికొనివచ్చినారు.

ప్రస్తుతము హైదరాబాదులో శ్రీ మారెళ్ళ కనకరాజుగారు "శ్రీసీతా రామ ఆదిశంకర ట్రస్టు" పేరున ఒకసంస్థ స్థాపించి తన్మూలకముగా భగవత్పాదులవారి వాఙ్మయము నంతను తెలుగులోని కనువదించి ప్రచా రము చేయతలపెట్టుట ముదావహముగా నున్నది. ఈ సందర్భమునందు ఒక్క విషయమును జ్ఞాపకములో నుంచుకొనవలయును. ఈ గ్రంథములను అనువదించుట సామాన్యుఁడైనవానికి సాధ్యముకాదు. కేవలము కావ్యము

లను జదివి శబ్దార్థ పరిజ్ఞానము ఉన్నంతమాత్రముతో వీనిని అనువదించుదు రనుకొనుట పాడి గాదు. అందుకు సాంప్రదాయ పరిజ్ఞానము క్షుణ్ణముగా నుండవలయును. శాస్త్రముయొక్క మర్మము తెలిసియుండవలయును. సంప్రదాయ పరిజ్ఞానముతేనివాఁడు ఎన్నిశాస్త్రములను జదివినను ఉపేక్షణీయుఁడే అని భగవత్పాదులవారు భగవద్గీతా భాష్యములో "అసంప్రదాయవిత్ సర్వశాస్త్ర విదపి మూర్ఖవ దుపేక్షణీయః" అని సెలవిచ్చిన విషయమును ఎప్పుడు జ్ఞప్తియం దుంచుకొనవలయును. అందువలన సంప్రదాయమును చక్కఁగా దెలిసికొన విద్వాంసులచేత ఈ అనువాదము చేయింపవలసినదిగా నేను సూచించుచున్నాను.

ఈట్రస్టు నిర్వహణలో కనకరాజుగారికి తోడుగా నలుగురు ధర్మకర్త లుండుట సంతోషముగా నున్నది. వారందఱును ఈ సంస్థయొక్క సర్వతోముఖాభివృద్ధికి పాటుపడగల రని మేము ఆశించుచున్నాము. ఈ సంస్థ దీర్ఘకాలము వర్ధిల్లుగాక యనియు, తనయుద్దేశ్యమును సఫలమొనర్చుగాక యనియు మేము ఆశీర్వదించుచున్నాము."

శ్రీహరిః ఓమ్ శ్రీగురుభ్యోనమః

# శ్రీ సీతారామ ఆదిశంకర ట్రస్ట్ (రిజిష్టర్డు)

[ఇంటి నెం. 24-141, ఆనంద్ బాగ్, మాల్కాజ్ గిరి,

హైదరాబాద్ - 500 047]

## ఉద్దేశ్యములు - లక్ష్యములు

1. శ్రీభగవత్పూజ్యపాదులును జగద్గురువులైన ఆదిశంకరాచార్యుల వారిచేఁ బ్రణీతగ్రంథములు - ఆధ్యాత్మిక, తాత్త్విక, వేదాంత భాష్యములును, భక్తిప్రబోధకములు, ఉపదేశ, స్తోత్ర, ప్రకరణాది సాహిత్యరచనలనెల్ల సేకరించి భద్రపరచుట.

2. పై పేర్కొన్న శ్రీ శంకరాచార్య కృత సంస్కృత రచనలకు, వాని ప్రసిద్ధవ్యాఖ్యలకును ఆంధ్రానువాదమును సమర్థులచే జేయించి ప్రచురించుట.

3. ఇంతమాత్రమేగాక, ఇంతకుఁబూర్వమే శ్రీభగవత్పాదులవారి రచనలు తెలుగులోని కనువదింపఁబడి ప్రస్తుతము లభ్యముకాని వానిని సైతము సేకరించి ప్రచురించుట.

4. అద్వైత సిద్ధాంతపరమైన వేదాంతమును బ్రచారముసేయుట:- అనుభవజ్ఞులైన యభిజ్ఞులచేఁ బ్రస్థానత్రయ ప్రసిద్ధ ధర్మాద్వైత సిద్ధాంత ప్రచారమును, అధ్యయన-అధ్యాపకాది రూపమునను, ఉపన్యాసములు, గోష్ఠులు, పండిత సదస్సులు మున్నగునవి ఏర్పాటుచేయుట మూలమునను సల్పి, జ్ఞానవిజ్ఞానాభిరుచి గల వాతావరణమును సమాజములో నెలకొల్పుట.

5. ఈ కార్యసిద్ధికై అవసరమైన యితర విధ కార్యకలాపములను ఆయా సందర్భముల కనుగుణముగా ఎన్నుకొని ముఖ్యోద్దేశ్యము నెరవేర్చుటకై పాటుపడుట.

ఈ సీతారామ ఆదిశంకర ట్రస్టు ది. 1-1-85 హైదరాబాద్‌లో శ్రీ శృంగేరీ శారదాపీఠాధిపతులు, ప॥ ప॥ జగద్గురు శ్రీ భారతీతీర్థమహాస్వాములవారిచే ఆశీఃపూర్వకముగాఁ బ్రారంభింపఁబడినది.

# విజ్ఞప్తి

శ్రీ చిదానందాశ్రమము - శ్రీ భువనేశ్వరీ పీఠాధిపతులు ప. ప. శ్రీశ్రీ సత్యానంద భారతీస్వామివారి యత్యంత ప్రియశిష్యులగు ప. ప. శ్రీశ్రీ చిదానందభారతీస్వామివారు, బ్రహ్మనిష్ఠులు. వీరు మా ప్రార్థనను మన్నించి శ్రీ శంకరభగవత్పాద విరచిత శ్రీ గాయత్రీ మంత్రభాష్య మున కాంధ్రానువాదము దక్షతతో, నిస్సంగతతో వ్రాసి యిచ్చి యను గ్రహించిరి. మచిలీపట్టణము బృందావన్ ప్రింటర్స్ వారు యథానుకూల ముగా నీగ్రంథము నిట్లు ముచ్చటగా ముద్రించిరి. ఈ పూజ్య శ్రీశ్రీ చిదానందభారతీస్వామివారికి మా కృతజ్ఞతాపూర్వక నమోవాకములు. ముద్రాపకులకును అభినందనశ్రీలు. శ్రీ గాయత్రీ మంత్రభాష్యార్థసిద్ధి కల్గుతమను శుభాకాంక్షలు అనుష్ఠాతలగు పాఠకమహాశయులకు.

మా ప్రకటిత జ్ఞానసేవా కార్యక్రమమును నిర్విఘ్నముగా కొన సాగించుటకు, శ్రీ జగద్గురువులను, శ్రీ పరమహంస పరివ్రాజకాచార్య వర్యులను, శ్రీమదద్వైతసిద్ధాంతప్రచారాభిమానులను, సహృదయులైన ఆస్తిక మహాజనులనెల్లరను, దమ తమ సహాయ సహకారములను అందింపవలసినదిగా వినయపూర్వకముగా ప్రార్థించుచున్నాము.

ఐదువందలరూపాయలుగాని, అంతకుమించిగాని విరాళము లిచ్చు దాతల పేర్లు మున్ముందు ప్రచురింపబడు గ్రంథములలో ముద్రింపబడును. అట్టి దాతలకు ఈ ట్రస్టు ప్రచురణలన్నియు ఒక్కొ-క్క-టి ఉచితముగా నొసంగబడును.

ఇట్లు జ్ఞానసేవలో

శ్రీ సీతారామ ఆదిశంకర ట్రస్ట్

# శ్రీ సీతారామ ఆదిశంకర ట్రస్టునకు శాశ్వతనిధిగా రూ. 500/- అంతకుమించి విరాళముల నిచ్చిన దాతల పేర్లు

శ్రీ వెంపటి శ్రీనివాసమూర్తిగారు, అడ్వకేటు, విజయవాడ.

శ్రీ కె. ఎ. వి. శివరామశర్మగారు, వనస్థలిపురము, హైదరాబాదు.

శ్రీ ఐ. బి. రామకృష్ణారావుగారు, వనస్థలిపురము, హైదరాబాదు.

శ్రీ పురమ్‌సెట్టి సత్తయ్యగారు, మల్కాజ్‌గిరి, హైదరాబాదు.

శ్రీ వి. లచ్చారావుగారు, అశోక్‌నగర్, హైదరాబాదు.

శ్రీ జి. శ్రీరామమూర్తిగారు, హెడ్‌మాస్టరు, రైల్వేబాలుర ఉన్నత పాఠశాల, గుంతకల్.

శ్రీ జె. ఎమ్. రామచంద్రన్‌గారు, మించన్ స్ట్రీటు, కర్నూలు.

శ్రీ శంకరభగవత్పాదులవారి ఒక అభిమాని, చెంబూర్. బొంబాయి

శ్రీ కె. క్రిష్ణయ్యగారు, మలక్‌పేటకాలని, హైదరాబాదు.

శ్రీ యాబలూరి లోకనాథశర్మగారు, అడ్వకేటు, విజయవాడ.

శ్రీ తాడేపల్లి నరసింహదాసుగారు, విజయవాడ.

శ్రీ కార్యదర్శి– శ్రీరామకృష్ణాశ్రమము, అశోక్‌నగర్, హైదరాబాదు.

శ్రీ మండలీక శ్రీరామమూర్తిగారు, S. C. RLY. ఆఫీసు, బెల్లంపల్లి.

శ్రీ పి. లక్ష్మణరావుగారు, మల్కాజ్‌గిరి, హైదరాబాదు.

శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు, వనస్థలిపురము, హైదరాబాద్.

శ్రీ శితలమ్ రాముగారు, దత్తాత్రేయకాలని, ఆసిఫ్‌నగర్, హైదరాబాద్.

శ్రీ కందర్ప శివరామకృష్ణగారు, మచిలీపట్నము.

శ్రీ కె. వి. పి. యల్. నరసింహారావు, రైల్వేబాలుర ఉన్నత పాఠశాల,
లాలాగూడ.

శ్రీ కందర్ప వెంకటేశ్వర్లుగారు, భిలాయ్.

శ్రీ చదలవాడ సుబ్రహ్మణ్యముగారు, సికింద్రాబాద్.

శ్రీ చుండూరు పార్థసారథిగారు, అడ్వకేటు, హైదరాబాద్.

శ్రీ తంగిరాల శ్రీరామశర్మగారు, సికింద్రాబాద్.

శ్రీ డా॥ కొమరవోలు వెంకట సుబ్బారావుగారు, రామకృష్ణాపురం,
రంగారెడ్డిజిల్లా

ఇట్లు

శ్రీ సీతారామ ఆదిశంకర ట్రస్టు

# బ్రాహ్మణోత్తములకు
## నారాయణ స్మరణ పూర్వక నివేదనము

"న గాయత్ర్యాః పరో మన్త్రః న మాతుః పర దైవతమ్" గాయత్రికి మించిన మంత్రము, తల్లికి మించిన దైవము లేదని భారతీయ ధర్మ సిద్ధాంతము. బ్రాహ్మణజాతి పవిత్రతకు ఔన్నత్యమునకును మూలమైనది గాయత్రీ జప విధానము. దీనిని ఆచరించువారు పవిత్రత కలిగియుందురు. పరిత్యజించినవారు పతితు లగుదు రనుటలో సందియము లేదు.

"న బ్రాహ్మణో వేదపాఠా న్న శాస్త్ర పఠనాదపి
దేవ్యా స్త్రికాల మభ్యాసాద్ బ్రాహ్మణ
స్స్యాద్ధి నాన్యథా॥

వేద పఠనమునగాని శాస్త్రాభ్యాసమున గాని బ్రాహ్మణత్వము నిలువదు. త్రి సంధ్యలయందు గాయత్రీ జపము సల్పిననే నిలుచును అని స్కాంద పురాణము చెప్పినది.

దేవీ భాగవతము ఏకాదశ స్కంధము 24 వ అధ్యాయములో గాయత్రీ మంత్రముతో చేయదగిన అనేక కామ్యానుష్ఠానములు పాప సంహారకములు సుఖ సంపాదకములు ఐనవి తెలుపబడినవి. వానిలో ఈ తరము వారికి కూడ ఆచరణ సాధ్యములగు కొన్ని ప్రక్రియలను నా మతి కొలది వ్రాసితిని. శ్రద్ధాభక్తులు కలిగి సంపూర్ణ విశ్వాసముతో

తదేక నిష్ఠతో నాచరించిన ఆయా ఫలితములు సాధింప వచ్చును. అణిమాది సిద్ధులు - ఋషిత్వ దేవత్వాదులును సాధింపదగిన అత్యంతక్లేశ సాధ్యములైన ప్రక్రియలను కూడ కొన్నింటిని పేర్కొంటిని. వాని వలన గాయత్రీ మంత్ర మహిమ గోచరించును. ఈ కామ్య కర్మల వివరణము "శారదా తిలక" మున వ్రాయబడినవని శ్రీ నీలకంఠ భట్ట కృత "తిలక" వ్యాఖ్యానమున పేర్కొనబడినది. అది నాకు లభింపలేదు. విశేష జిజ్ఞాసువులు దానిని చూచి గ్రహింప వచ్చును.

గాయత్రీ మంత్రోపదేశమునకు మూలమైన ఉపనయన సంస్కారము చేయుటకే చాలమంది అశ్రద్ధ చేయుచుండుట శోచనీయము. వారు పెండ్లికి ముందుగ మొక్కుబడివలె తీర్చుచున్నారు. దానికి ముహూర్తమే లేదు. పెండ్లికి ముందురోజు అష్టమి కానిండు అమావాస్య కానిండు ఒక జందెము తొడుగుచున్నారు. బ్రాహ్మణులు ఎనిమిదేండ్ల వయసులో చేయవలసిన ఉపనయనమునకు పదునారేండ్ల వఱకు, క్షత్త్రియులు 11 సం॥కు చేయవలసిన దానికి 22 సం॥ వఱకు, వైశ్యులు 12 సం॥కు చేయవలసిన దానికి 24 ఏండ్ల వరకు ధర్మశాస్త్రము గడు విచ్చినది. దానిని కూడ పాటింపక లిమిటేషను పెట్టిన నోటుమీద చెల్లువేసినట్లు ఏదో యొకనాడు అది ముగించుట అత్యంత శోచనీయము.

తల్లిదండ్రులకు మరొకరి చొరవతో పనిలేని ఈ కార్యమును సంస్కార దృష్టితో సత్యనారాయణ వ్రతమువలెనైన

నెరవేర్చి తమ పుత్రులకు బ్రాహ్మణత్వ భిక్ష పెట్టుదురు గాక! బ్రాహ్మణ సంఘములు లౌకిక విద్యా సదుపాయముల కొఱకు ఉద్యోగముల కొఱకు వెనుకబడిన జాతుల దృష్టాంతముతో ప్రభుత్వ రంగములో పాటుబడుచున్నవి కాని బ్రాహ్మణత్వము నిల్పుటకు వర్ణసాంకర్యము నరికట్టుటకును తగినంతగా ప్రయత్నింప కుండుట శోచనీయము. సంపన్న గృహస్థులు తమ కుమార్తెలకు వివాహము చేయునపుడు ఒక పేద బ్రాహ్మణ వటువునకు ఉపనయనము చేసి పుణ్యము కట్టుకొందురు గాక!

నన్నీ గ్రంథము వ్రాయ ప్రేరేపించువారు శ్రీ మారెళ్ళ కనకరాజుగారు. వీరు శ్రీ సీతారామ ఆదిశంకర ట్రస్టు అను పేర నొక సంస్థను నెలకొల్పి శ్రీ శంకరాచార్య భాష్యముల యాంధ్రానువాదములను ముద్రించి ఆంధ్రులకు అందించుచున్న ధన్యచరితులు. వీరు శ్రీ శంకరాచార్యుల వారు రచించిన గాయత్రీ భాష్యమును ఆంధ్రీకరించుటకై నన్ను కోరి ఆ గ్రంథముతోబాటు గాయత్రీ ప్రస్తావము గల ఛాందోగ్య బృహదారణ్యక - బ్రహ్మ సూత్ర భాగముల సూచనను, గాయత్రీ ఛందసామహిమ్నను గీతా శ్లోకమునకు శ్రీ బెల్లంకొండ రామరాయ కవీంద్రులు రచించిన భాష్యార్క ప్రకాశికలోని భాగమును మఱికొన్ని ఆధారములను అందజేసిరి. తదాధారముగను, నాకు లభించిన మనుస్మృతి, స్కాందపురాణము, పద్మపురాణము, దేవీ భాగవతములను

కూడ చూచి అందుగల గాయత్రీ విశేషములను యథోచితముగ పొందుపరచియు నీ గ్రంథమును వ్రాసితిని.

అస్మత్ప్రియ హితైషులగు శ్రీ బంధకవి మృత్యుంజయరావుగారు నా గ్రంథము గాయత్రీ విషయ సర్వస్వము కల విపుల గ్రంథము కావలెనను తలంపుతో శ్రీ గరిమెళ్ళ వీరరాఘవులుగారు వ్రాసిన గాయత్రి యను రెండు భాగములు గల గ్రంథమును, శ్రీ గాయత్రీ పీఠాధిపతులు వ్రాసిన గాయత్రీ కౌముది యను గ్రంథమును నాకు పంపిరి. వానిని చదువగా అందు గాయత్రిని గూర్చిన అద్భుత విశేషములు కనబడినవి. వానిని నా గ్రంథములో జొప్పించుట అనుచితమని తోచి వదలితిని. విషయములు అనంతములు. ఎన్ని గ్రంథములు చూచి వ్రాసినను సమగ్రత చేకూరుట దుర్లభము. నన్ను ప్రోత్సహించిన సహృదయులకు గాయత్రీ కృపవలన నిఖిలశ్రేయములు లభించుగాక! పుస్తకము చిన్నదైనను ప్రతిపాద్య మహత్త్వమును తలపోసి తృప్తిచెందితిని. అజ్ఞానకృతదోషములను విజ్ఞానులు సహృదయతతో సవరించి తెల్పుదురుగాక! ఈ కృతిని అస్మద్గురుచరణులు ప. ప. శ్రీ శ్రీ సత్యానందభారతీస్వామివారి చరణారవిందములకు భక్తితో అంకితమొనర్చుచున్నాను.

శ్రీ చిందానందాశ్రమము
గన్నవరం-కృష్ణాజిల్లా
శాలి 1910 శుక్ల సం॥
చైత్ర శుక్ల ప్రతిపత్

నారాయణస్మృతిః
**శ్రీ చిదానంద భారతీస్వామి**
శ్రీ భువనేశ్వరీ పీఠాధిపతి

# విషయ సూచిక

—0—

శ్రీ భువనేశ్వరీపీఠ స్థాపకులు



ప్రథమ పీఠాధిపతులు

ప. ప. శ్రీశ్రీశ్రీ సత్యానందభారతీస్వామివారు

గన్నవరం - కృష్ణాజిల్లా

గ్రంథకర్త



ప. ప. శ్రీశ్రీశ్రీ చిదానందభారతీస్వామి
శ్రీ భువనేశ్వరీపీఠము
ద్వితీయ పీఠాధిపతి

శ్రీమత్పరదేవతాయై నమః

# శ్రీగాయత్రీ మంత్ర శంకర భాష్యము

శ్లో॥ నారాయణ సమారంభాం, వ్యాసశఙ్కరమధ్యమామ్।
శ్రీసత్యానందపర్యన్తాం వందే గురు పరమ్పరామ్ ॥

## గాయత్రీమంత్రార్థ ప్రకరణము :-

1. ఓం భూర్భువస్సువః
2. తత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి, ధియో యో నః ప్రచోదయాత్
3. ఓమాపో జ్యోతీ రసోఽమృతం బ్రహ్మ భూర్భువస్సువరోమ్

1) వ్యాహృతులు 2) గాయత్రి 3) శిరస్సు అని గాయత్రిలో మూడు భాగములు. (వి+ఆ+హృతి; వి=అవిశేషముగ, ఆ=నలువైపులనుండి, హృతి= చేరదీయుట. భావనాబలముచే భూరాదిలోకములను చేరదీసి వానిని (ప్రణవ=) బ్రహ్మస్వరూపముగ నిశ్చయించుట.) సంధ్యావందనములో జపింపవలసినది వ్యాహృతిసహితమైన గాయత్రి.

## భాష్యము

యః సవితా దేవః నః అస్మాకం ధియః కర్మాణి ధర్మాది విషయా వా బుద్ధీః ప్రచోదయాత్ ప్రేరయేత్, తత్ తస్య

శ్రీమత్పరదేవతాయై నమః

# శ్రీగాయత్రీ మంత్ర శంకర భాష్యము

శ్లో॥ నారాయణ సమారంభాం, వ్యాసశఙ్కరమధ్యమామ్।
శ్రీసత్యానందపర్యన్తాం వందే గురు పరమ్పరామ్ ॥

## గాయత్రీమంత్రార్థ ప్రకరణము :-

1. ఓం భూర్భువస్సువః
2. తత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి, ధియో యో నః ప్రచోదయాత్
3. ఓమాపో జ్యోతీ రసోఽమృతం బ్రహ్మ భూర్భువస్సువరోమ్

1) వ్యాహృతులు 2) గాయత్రి 3) శిరస్సు అని గాయత్రిలో మూడు భాగములు. (వి+ఆ+హృతి; వి=అవిశేషముగ, ఆ=నలువైపులనుండి, హృతి= చేరదీయుట. భావనాబలముచే భూరాదిలోకములను చేరదీసి వానిని (ప్రణవ=) బ్రహ్మ స్వరూపముగ నిశ్చయించుట.) సంధ్యావందనములో జపింపవలసినది వ్యాహృతిసహితమైన గాయత్రి.

## భాష్యము

యః సవితా దేవః నః అస్మాకం ధియః కర్మాణి ధర్మాది విషయా వా బుద్ధీః ప్రచోదయాత్ ప్రేరయేత్, తత్ తస్య

ధర్మసంబంధములైన బుద్ధివృత్తులను ప్రేరణ చేయునో అట్టి పరమేశ్వరునకు ఆత్మభూతమైన జ్ఞానము అందఱకు ఉపాసింపదగినది. అందఱకు తెలియదగినది. అది అవిద్యాకామకర్మలను భర్జనము అనగా దహింపజేయు భర్గము తేజఃపుంజము గాన స్వయంప్రకాశమైనది. అదియే పరబ్రహ్మస్వరూపమైన జ్ఞానము. అదియే నా హృదయసాక్షియైన జ్ఞానము. నాహృదయసాక్షియైన జ్ఞానమే ఆపరబ్రహ్మస్వరూపమని ధ్యానము చేయుచున్నాను.

ఈ యర్థమునే సంధ్యావందనములోని గాయత్రీధ్యాన శ్లోకము తెల్పుచున్నది. ఎట్లన

యో దేవ స్సవితాస్మాకం ధియో ధర్మాదిగోచరాః
ప్రేరయేత్తస్య యద్భర్గః తద్వరేణ్యముపాస్మహే॥

ఇచటను గాయత్రీ మంత్రమందునుగల "సవితా" అనుపదమునకు సూర్యుడు అని స్థూలార్థము. అది తీసికొన్నను సూర్యగోళమని యర్థము కాదు. దానిలోనున్న పరమాత్మయని గ్రహించవలెను. సృష్టికర్తయగు పరమాత్మయన్నను ఒకటియే. సవితా యనగా ప్రసవితా యని యర్థము. జగత్తును ప్రసవించిన (సృష్టించిన) వాడని యర్థము వచ్చుచు సూర్యుడు మనకు ప్రత్యక్షదేవత అయినందున సూర్యమండలవర్తి యని గుర్తుపెట్టుకొనుట సులభమైనందున

సవితృ శబ్దమునకు సూర్యుడని ప్రసిద్ధి వచ్చినది. అదియు గాక సూర్యుని ఉదయముతో ప్రాతస్సంధ్యకును అస్త మయముతో సాయంసంధ్యకును కాలముద్వారా సంబంధము కలిగినది. అదియుగాక సావిత్రి యను పదము సవితృ పదమునుండి యేర్పడుట కూడ గాయత్రి సూర్యసంబంధమని భ్రమపడుటకు కారణమైనది.

2) భా॥ యద్వా తదితి భర్గోవిశేషణం, సవితుః దేవస్య తత్ తాదృశం భర్గః ధీమహి, కిం తత్ ఇతి అపేక్షాయాం ఆహ-యః ఇతి లింగస్యవ్యత్యయః యద్భర్గః ధియః ప్రచోదయాత్ ఇతి తత్ ధ్యాయేమ ఇతి సమన్వయః.

అ॥ మఱియొక విధమైన అన్వయము :- తత్ అనునది భర్గశ్శబ్దమునకు విశేషణము. సవితుః దేవస్య = జగత్సృష్టి చేయు తేజోరూపము యొక్క, తత్ = అటువంటి భర్గః = తేజస్సును, ధీమహి = ధ్యానింతుము. కింతత్ = అదియేది, ఇతి అపేక్షాయాం = అని ఆకాంక్షింపగా, ఆహ = చెప్పుచున్నాడు. యః ఇతి లింగవ్యత్యయః = యత్ అని చెప్పవలసి యుండగా లింగము మార్చి యః అని చెప్పబడెను. యత్ భర్గః = ఏ తేజస్సు, ధియః = బుద్ధులను ప్రచోదయాత్ = ప్రేరేపించునో, ఇతి = ఈ కారణమున. తత్ ధ్యాయేమ = దానిని ధ్యానింతుము, ఇతి సమన్వయః = ఇట్లు అన్వయము చేసికొనవలెను.

తా॥ మొదటి అన్వయములో యః అనుపదము సవితృనకు విశేషణము కాగా ఈసారి దానిని యత్ గా మార్చి భర్గశ్శబ్దమునకు విశేషణము చేయబడినది. భర్గస్సన తేజస్సు.

ఏ జ్ఞానమయ తేజస్సు మన బుద్ధిస్మృతులను ఆయా ధర్మ కర్మలను గూర్చి ప్రేరేపించుచున్నదో అదియే నేనని ధ్యానించుచున్నాము. మొదటి అన్వయములో కూడ ఈ భావమే. భర్గశ్శబ్దము నపుంసకలింగము. సవితృ శబ్దము పుంలింగము. రెండును నిర్గుణ పరబ్రహ్మమునే బోధించును. "న స్త్రీ పుమాన్ న చ నపుంసక మేకరూపమ్" నిర్విశేషమైన పరబ్రహ్మమునకు లింగ నియమము లేదు. ఏ లింగ పదములతోనైన వ్యవహరింపవచ్చును. "అవ్యక్తాత్పురుషః పరః పురుషాన్న పరం కించిత్" అను కఠోపనిషద్వాక్యములో పరబ్రహ్మము పురుష పదముతో చెప్పబడెను. "అయ మాత్మాబ్రహ్మ" అను మాండూక్య వాక్యములో పుంలింగ శబ్దమైన ఆత్మన్ శబ్దముచే చెప్పబడెను. "సదేవ సోమ్య" అనుచోట సత్ అని, "ఏక మేవాద్వితీయం" అనుచోట, "ఏకం సత్ విప్రాః" అనుచోటను నపుంసక లింగము, "ఏకా సంవిదేషా" అనుచోట స్త్రీ లింగముతోడను పరబ్రహ్మము బోధింపబడెను.

3. భా॥ యద్వా యః సవితా-సూర్యః, ధియః కర్మాణి ప్రచోదయాత్ ప్రేరయతి, సః తస్య సవితుః సర్వస్య ప్రసవితుః దేవస్య ద్యోతమానస్యసూర్యస్య, తత్ సర్వైః దృశ్యతయా ప్రసిద్ధం, వరేణ్యం సర్వైః సంభజనీయం. భర్గః పాపానాం తాపక తేజోమండలం, ధీమహి ధ్యాయేమ, మనసా ధారయేమ.

అ॥ యద్వా=లేక (మరియొక అన్వయము) యః సవితా సూర్యః=ఏ సూర్యుడు ధియః కర్మాణి=మానవునకు ఆచరణీయములైన కర్మలను ప్రచోదయాత్ ప్రేరయతి = ప్రేరేపించునో, సః = అట్టివాడు, తస్య సవితుః=సర్వస్యప్రసవితుః = అన్నిటిని సృష్టించెడి, దేవస్య=ద్యోతమానస్య సూర్యస్య=ప్రకాశించుచున్న సూర్యుని యొక్క, తత్=సర్వైః దృశ్యతయా ప్రసిద్ధం=అందరిచేత చూడదగినదిగా ప్రసిద్ధమైన, వరేణ్యం =సర్వైః సంభజనీయం= అందరిచేత సేవింపదగిన, భర్గః=పాపానాం తాపక తేజోమండలం = పాపములను దహించెడి తేజోవలయమును, ధీమహి = ధ్యాయేమ, మనసా ధారయేమ = ధ్యానము చేతుము అనగా మనస్సునందు నిల్పుకొందుము.

తా॥ మరియొక అన్వయము: ఏ సూర్యుడు తన ఉదయాస్తమయముల ద్వారా మానవులను విధివిహిత కర్మల వైపు ప్రేరేపించునో, ఎవడు సర్వసృష్టికి తన కిరణ ప్రసారముచే కారణమగునో నిత్యము వెలుగొందెడి ఆ సూర్య భగవానుని యొక్క ఏ తేజస్సు అందరిచేతను వరింపదగినదో సేవింపదగినదో ఏది పాపములను దహింపజేయునో అట్టి తేజోమండలమును ధ్యానింతుము. అనగా హృదయమున నిల్పుకొందుము.

విశేషము :- ఈ భావము నిర్గుణ బ్రహ్మతత్త్వమును అనుసంధానము చేయు శక్యము కాని వారలను గూర్చి చెప్పబడినది. గాయత్రీదేవిని సూర్య మండల వర్తినిగా ధ్యానించుట సులభము. సూర్యుడు ప్రత్యక్ష దేవతకదా!

ఈతని తేజస్సు అందరకు వరణీయము. ఇది కన్నులచే గ్రహింపదగిన భాస్వర శుక్లము. కన్నులకు కనపడని సంస్కార రూపమైన పాపమును నశింపజేయుట కిది సమర్థమగునా? యని శంక కలుగవచ్చును. అది పొసగదు. కాని ఆ కాంతికి అధిష్ఠానమైన జ్ఞానము పాపనాశన సమర్థమైనది. ఈ ధ్యాతయొక్క ధ్యానము అధిష్ఠానముపైన విశ్రమించును. అది సర్వపాపక్షయ దక్షమైనది. "న హి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే" జ్ఞానమంతటి పవిత్ర వస్తువు వేరొకటి లేదు. ఈ యన్వయములో సూర్యుడు మాటవరుసకు ప్రధానమైనను అన్ని విశేషణములు పూర్తిగా వర్తింపవు. సర్వ సృష్టికి కారణమైన వాడని యొక విశేషణమున్నది. అది కుదరదు. సూర్యుడు పంచ భూతములలో తేజస్సనెడు భూతము. అది యొక్కటి సర్వ సృష్టికి కారణమెట్లగును? భూతములన్నియు కలసియే కారణమగును కావున ఇది ఔపచారిక కథనము.

4) భా. యద్వా భర్గశ్శబ్దేన అత్ర అన్నం అభిధీయతే యః సవితా దేవః ధియః ప్రచోదయతి తస్యప్రసాదాత్ భర్గః అన్నాది లక్షణం ఫలం ధీమహి ధారయామః తస్య ఆధార భూతా భవేమ ఇత్యర్థః.

అ॥ మరియొక అర్థము : భర్గశ్శబ్దేన=భర్గః అను పదము చేత అత్ర=ఇచట అన్నం, అభిధీయతే = అన్నమని చెప్పబడును. యః

సవితాదేవః = ఏ సవితయను దేవత, ధియః ప్రచోదయతి = బుద్ధులను ప్రేరణచేయునో, తస్యప్రసాదాత్ = దాని యనుగ్రహముచేత, భర్గః అన్నాది లక్షణం ఫలం=ఆహారాది రూపమైన ఫలమును, ధీమహి ధారయామః=ధరించెదము, తస్య ఆధారభూతా భవేమ ఇత్యర్థః = దానికి ఆధారభూతుల మయ్యెదమని యర్థము.

తా॥ **మరియొక వివరణము :** ఇందు భర్గశ్శబ్దమునకు **అర్థము** ఆహారపదార్థమని గ్రహింపవలెను. ఏ సవితృదేవత అనగా సూర్యుడు మన బుద్ధి వృత్తులను ధర్మాచరణమునకు ప్రేరణ చేయునో అతని యనుగ్రహము వలన మాకు సస్య సమృద్ధి కలిగి సుఖ జీవనము ప్రాప్తించు గాక! ఇది మందాధికారులను గూర్చి ప్రవర్తించినది. సూర్యుడు వేసవియందు తన కిరణములచే భూమిపైని నీటిని ఆవిరిచేయుట, దాన మేఘము లేర్పడుట, అవి వర్షించుట, దాన పైరులు పండుట యనునది సామాన్యులెరిగినదియే, దాన సస్యోత్పత్తి హేతువైన సూర్యుని ప్రార్థించి జీవు డాహార సమృద్ధిని పొందుట యీ పక్షమున వర్ణింపబడినది. అయితే పేరునకు సూర్యుడైనను బుద్ధివృత్తులను ప్రేరేపించు నంతర్యామిగా ధ్యానింపబడుచున్నాడు కావున నిరస్త సమస్త విశేషమైన నిర్గుణ పరబ్రహ్మముయొక్క ధ్యానమే జరుగుచున్నది. కానిఐహిక ఫల మపేక్షించుటచే ఈ ధ్యానము అంతః కరణ శుద్ధిని సమకూర్చజాలదు.

పై దెల్పిన నాల్గు కల్ప (అన్వయ)ములలో మొదటి రెండు ఉత్తమాధికారులకు మూడవది మధ్యమాధికారులకు ఇది మందాధికారులకు వర్తించుననని తెలియుచున్నది.

5 భా॥ అథ సర్వదేవాత్మనః సర్వశక్తేః సర్వావభాసక తేజోమయస్య పరమాత్మనః సర్వాత్మకత్వ ప్రతిపాదక గాయత్రీ మహామన్త్రస్య ఉపాసనాప్రకారః ప్రకాశ్యతే. తత్ర గాయత్రీం ప్రణవాది సప్తవ్యాహృత్యుపేతాం శిరస్స మేతాం సర్వవేదసారమితి వదన్తి, ఏవంవిశిష్టాదగాయత్రీ ప్రాణాయామైః ఉపాస్యా.

అ॥ అథ = అనంతరము, సర్వదేవాత్మనః = నిఖిలదేవతాస్వరూపుడును, సర్వశక్తేః = సృష్ట్యాదిసర్వశక్తులు కలవాడును, సర్వావభాసక తేజోమయస్య = అన్నిటిని తెలియజేసెడి జ్ఞానస్వరూపుడునుఅగు, పరమాత్మనః = పరాత్పరునియొక్క, సర్వాత్మకత్వప్రతిపాదక = సర్వమయత్వమును బోధించెడి, గాయత్రీ మహామన్త్రస్య = గాయత్రీమహామంత్రము యొక్క, ఉపాసనాప్రకారః = ఉపాసనచేయువిధము, ప్రకాశ్యతే = ప్రకటింపడుబచున్నది. తత్ర = ఆవిషయమున, గాయత్రీం = గాయత్రీమంత్రమును, ప్రణవాదిసప్తవ్యాహృత్యుపేతాం = ఓఙ్కారముముందుగల ఏడువ్యాహృతులతో గూడినది, శిరస్సమేతాం = శిరస్సుతోగూడినది, సర్వవేదసారమితి = ఎల్లవేదములకు సారమైనదని, వదన్తి = (వేదవేత్తలు) చెప్పుదురు. ఏవం విశిష్టా గాయత్రీ = పై దెల్పినటుల వ్యాహృతి శిరోయుక్తయైన గాయత్రి, ప్రాణాయామైః = ప్రాణాయామములతో, ఉపాస్యా = ధ్యానముచేయదగినది.

గాయత్రీ మంత్రార్థమును ఉత్తమ, మధ్యమ, మందాధికారులకు నాల్గు తెరంగుల వివరించి యిపుడు గాయత్రీ మంత్రమునకు సంధ్యావందనములో గాక వేరుగా ఉపాసనచేయు పద్ధతిని బోధించుచున్నారు.

తా॥ సర్వదేవతాస్వరూపుడు, సర్వశక్తిసంపన్నుడు, సర్వపదార్థములను తెలియజేయు జ్ఞానస్వరూపుడు ఐన పరమాత్మయొక్క సర్వమయత్వమును బోధించెడి గాయత్రీ మహామంత్రము యొక్క ఉపాసనాప్రకారము ప్రకటింపబడుచున్నది. ప్రణవము ముందుగల సప్తవ్యాహృతులను శిరస్సు కలిగిన గాయత్రి సకలవేదసారమని వేదవేత్తలు చెప్పుదురు.

## ప్రణవాది సప్తవ్యాహృతులు

1. ఓం భూః 2. ఓం భువః 3. ఓగ్ం సువః 4. ఓం మహః
5. ఓం జనః 6. ఓం తపః 7. ఓగ్ం సత్యం

# గాయత్రీ శిరస్సు

ఓ మాపో, జ్యోతీ, రసోఽమృతం బ్రహ్మ భూర్భువస్సువరోమ్. ఓఙ్కారము పరబ్రహ్మమునకు ప్రతీకము అనగా రాము, కృష్ణ, నారాయణాది దేవులకు, లక్ష్మి, గౌరీ, సరస్వత్యాదిదేవతలకును ఆయా విగ్రహము లెట్లు ఆరాధనా సాధనములో అటులనే నిర్గుణ పరబ్రహ్మమునకు

ఓంకారము ఉపాసనా సాధనము. "ఓమిత్యేకాక్షరం బ్రహ్మ" అని సంధ్యాప్రకరణమునను, తత్తే సంగ్రహేణ ప్రవక్ష్యే "ఓమ్" ఇత్యేతత్ ఏతద్ధ్యేవాక్షరం బ్రహ్మ అని కఠోపనిషత్తులోను, ఓంకారము అక్షరపరబ్రహ్మమని చెప్పబడెను. "ఓమితీదగ్ం సర్వం తస్యోపవ్యాఖ్యానం భూతంభవద్భవిష్యదితి సర్వమోంకారఏవ" కనబడుచున్న ప్రపంచమేగాక జరిగినది రానున్నది కూడ ఓంకారస్వరూపమే యని మాండూక్యోపనిషత్తులో చెప్పబడినది. సప్త వ్యాహృతులు ప్రణవపూర్వకముగా నున్నందున అన్నియు బ్రహ్మస్వరూపమే యనియర్థ మగును.

ఓం భూః = భూలోకము బ్రహ్మస్వరూపము
ఓం భువః = భువర్లోకము ,,
ఓం సువః = స్వర్గలోకము ,,
ఓం మహః = మహర్లోకము ,,
ఓం జనః = జనోలోకము ,,
ఓం తపః = తపోలోకము ,,
ఓం సత్యం = సత్యలోకము ,,

ఇట్లే గాయత్రీ శిరస్సుకూడ ప్రణవపూర్వకమై సర్వము బ్రహ్మస్వరూపమని బోధించుచున్నది.

ఓమ్ ఆపః = జలము బ్రహ్మస్వరూపము
జ్యోతిః = సూర్యచంద్రాగ్నులలోనున్న తేజస్సు బ్రహ్మస్వరూపము

రసః = తీపి, పులుపు ఉప్పు, కారము మొదలైన ఆరు రుచులును బ్రహ్మస్వరూపము

అమృతం = దేవతల యాహారమైన అమృతము

బ్రహ్మ = బ్రహ్మస్వరూపము

భూర్భువస్సువః = భూర్భువస్సువర్లోకములును

ఓమ్ = బ్రహ్మస్వరూపము

ఓంకారము ఆదియందును అంతమందును చెప్పుట మంగళము కొఱకు. పై దెల్పిన సప్తవ్యాహృతులు- శిరస్సుతో గూడిన గాయత్రి ప్రాణాయామములో ఉపయోగపడును. ఎట్లన-

శాస్త్రీయములైన శుభాశుభకర్మలన్నియు సంకల్ప పూర్వకముగా జరుగవలెను. మొదట ఆచమనము చేసి ముమ్మారు ప్రాణాయామము చేయవలెను. ఈ ప్రాణాయామములో పైదెల్పిన సప్తవ్యాహృతులతో శిరస్సుతోడను కూడిన గాయత్రీ మంత్రమును స్మరింపవలెను. ప్రాణాయామములో మూడు భాగములుండును.

1. గాలిని పీల్చుట = పూరకము
2. గాలి లోపల నిల్పుట = కుంభకము
3. గాలి విడచుట = రేచకము

పూరక సమయమునకు 4 రెట్లు కుంభకము, 2 రెట్లు రేచకము. అనగా గాలి పీల్చుకొను కాలము 5 అంకెలయిన

గాలిని లోపలనిల్పు కాలము 20 అంకెల కాలము. గాలి వదలు కాలము 10 అంకెలు.

గాలిని లోపల నిరోధించి యున్నపుడు పై మంత్రమును గాలి పీల్చు సమయమునకు 4 రెట్లు కాలము మనసులో ధ్యానింపవలెను. లేనిచో మనసు క్షణమూరుకొనదు కదా! ఏవేవో అసంబద్ధమైన విషయములను తలపోయును. ఈ మంత్రమును ధ్యానించిన యెడల మనస్సునకు స్థిరత్వము కలుగును. మంత్రరహితముగ ప్రాణాయామము చేసిన యెడల అది శరీర పటుత్వమునకు మాత్రమే ఉపయోగించును. అది హఠయోగమునకు సంబంధించును. వారు కూడ కొంతకాలమునకు మంత్రముతో సంబంధము పెట్టుకొందురు. కుంభక కాలమును పెంచిన కొలది గాయత్రీ ధ్యానమును కూడ పెంచవలెను.

6 భా॥ సప్రణవవ్యాహృతిత్రయోపేతా, ప్రణవాన్తా గాయత్రీ జపాదిభిః ఉపాస్యా తత్ర శుద్ధ గాయత్రీ ప్రత్యగ్ బ్రహ్మైక్యప్రబోధికా ధియోయోనః ప్రచోదయాదితి. నః అస్మాకం ధియః బుద్ధీః యః ప్రచోదయాత్ ప్రేరయేత్ ఇతి సర్వబుద్ధి సంజ్ఞాన్తఃకరణప్రకాశక సర్వసాక్షీ ప్రత్యగాత్మా ఇతి ఉచ్యతే. తస్య ప్రచోదయాచ్ఛబ్దనిర్దిష్టస్య ఆత్మనః స్వరూపభూతం పరంబ్రహ్మ తత్సవితుః ఇత్యాదిపదైః నిర్దిశ్యతే. తత్ర ఓం తత్సత్ ఇతి నిర్దేశః బ్రహ్మణః త్రివిధః స్మృతః ఇతి తచ్ఛబ్దేన ప్రత్యస్తమితసర్వవిశేషం సిద్ధం పరంబ్రహ్మ

ఉచ్యతే. సవితుః ఇతి సృష్టిస్థితిలక్షణకస్య సర్వప్రపఞ్చస్య సమస్త ద్వైతవిభ్రమస్య అధిష్ఠానం లక్ష్యతే. వరేణ్యం ఇతి సర్వవరణీయం నిరతిశయానందరూపం భర్గః, ఇతి అవిద్యా దోష భర్జనాత్మకజ్ఞానైక విషయత్వం, దేవస్య ఇతి సర్వద్యోతనాత్మకాఖండ సదేకరసం సవితుః దేవస్య ఇతి. అత్ర షష్ఠ్యర్థః రాహోశ్శిరవత్ ఔపచారికః బుద్ధ్యాదిసర్వదృశ్యసాక్షిలక్షణం యన్మే స్వరూపం తత్ సర్వాధిష్ఠాన రూపం పరమానందం నిరస్తసమస్తానర్థరూపం స్వప్రకాశ చిదాత్మకం బ్రహ్మ ఇతి ఏనం ధీమహి ధ్యాయేమ.

అ॥ సప్రణవవ్యాహృతిత్రయోపేతా = ప్రణవము మూడువ్యాహృతులతో కూడినదియు, ప్రణవాన్తా = చివరప్రణవము కలిగినదియునగు - అనగా

"ఓమ్ భూర్భువస్సువః తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి ధియో యోనః ప్రచోదయాత్ ఓమ్" అను, గాయత్రీ = గాయత్రీ మంత్రము, జపాదిభిః = జపధ్యానాదులలో, ఉపాస్యా = ఉపాసన చేయదగినది. తత్ర = ఇంతవఱకు తెల్పిన గాయత్రీమంత్రములలో, శుద్ధా గాయత్రీ = శుద్ధ (కేవల) గాయత్రి, ధియోయోనః ప్రచోదయాత్ ఇతి = ధియోయోనః ప్రచోదయాత్ అనునది. నః = అస్మాకం = మాయొక్క, ధియః = బుద్ధీః = బుద్ధులను, యః = ఎవడు, ప్రచోదయాత్ = ప్రేరయేత్ = ప్రేరేపించునో, ఇతి = కావున, సర్వబుద్ధి = ఎల్లబుద్ధులను, సంజ్ఞా = నామములను, అంతఃకరణ = మనస్సులను, ప్రకాశక = ప్రకాశింప (తెలియ) జేసెడి, సర్వసాక్షీ = అన్నిటికిసాక్షి (చూచునది) యైనజ్ఞానము, ప్రత్యగాత్మా ఇతి = ప్రత్యగాత్మయని, ఉచ్యతే = పిలువబడుచున్నది. తస్య =

అట్టి, ప్రచోదయాత్ శబ్దనిర్దిష్టస్య=ప్రచోదయాత్ అనే పదముచే ప్రతిపాదింపబడిన. ఆత్మనః = ఆత్మకు, స్వరూపభూతం = స్వరూపమైన. పరంబ్రహ్మ=పరబ్రహ్మము, తత్సవితుః ఇత్యాదిపదైః = తత్సవితుః మొదలైన పదములచేత, నిర్దిశ్యతే=చెప్పబడుచున్నది, తత్ర=ఆవిషయమున, ఓం తత్సదితినిర్దేశః=ఓం-తత్-సత్ అను పదముల ప్రయోగము బ్రహ్మణః=బ్రహ్మకు, త్రివిధః=మూడుతెరగుల, స్మృతః=చెప్పబడినది. ఇతి=కావున, తత్శబ్దేన=తత్ అనుపదముచేత, ప్రత్యగ్భూత=ప్రతివ్యక్తిలోనుఉన్న, స్వతస్సిద్ధం=సహజసిద్ధమైన, పరంబ్రహ్మ=పరబ్రహ్మము, ఉచ్యతే=చెప్పబడుచున్నది. సవితుఃఇతి=సవితుఃఅని, సృష్టిస్థితిలయలక్షణకస్య = సృష్టిస్థితిలయలక్షణములుగల, సర్వప్రపంచస్య=సమస్తద్వైతవిభ్రమస్య = నిఖిలద్వైతవిలాసమునకు, అధిష్ఠానం = కల్పనాధారము లక్ష్యతే=అరసుగాగ్రహింపబడును. వరేణ్యంఇతి=అందరిచే వరింపదగినది నిరతిశయానందరూపమైనది. భర్గఃఇతి=భర్గఃఅనగా, అవిద్యాదోషభర్జనాత్మక=అవిద్యాదోషమునుదహింపజేసెడి, జ్ఞానైక విషయత్వం=జ్ఞానముమాత్రమేయగుట, దేవస్యఇతి = దేవస్యఅనగా, సర్వద్యోతనాత్మక=అన్నిటినిప్రకాశింపజేసెడి, అఖండసదేకరసం = అఖండమైన సత్తామాత్రస్వభావము, సవితుః దేవస్య ఇతి అత్ర షష్ఠ్యౌః = సవితుః దేవస్య అను రెండుపదములపైనున్న షష్ఠీవిభక్తుల యర్థము. రాహోః శిరోవత్ ఔపచారికః = రాహువుయొక్క-శిరము అన్నచోటవలె మాట వరుసకు మాత్రమే. రాహువేశిరోరూపమై యుండగారాహువుయొక్క- అను షష్ఠీవిభక్తికి ప్రథమార్థమే. రాహువనెడి శిరస్సుఅని యర్థము. అట్లే సవితుః దేవస్య సృష్టికర్త,ప్రకాశమానమునైన(భర్గః)తేజము అనియర్థము బుద్ధ్యాదిసర్వదృశ్యసాక్షిలక్షణం = బుద్ధిమొదలైన సర్వదృశ్యములకు సాక్షిరూపమైన, యత్మేస్వరూపం=ఏ నా స్వరూపముకలదో, [illegible] =

అది, సర్వాధిష్ఠానభూతం = అన్నిటికి అధిష్ఠానమైన, పరమానందం = పరమానందము, నిరస్తసమస్తానర్థరూపం = ఎల్లయనర్థములను పోగొట్టునది, స్వప్రకాశచిదాత్మకం = స్వయంప్రకాశమానము జ్ఞానరూపము ఐన బ్రహ్మమని, ఏవంధీమహి = ధ్యాయేమ = ఇట్లు ధ్యానింతుము.

తా॥ జపము చేయు గాయత్రీ మంత్రమునకు చివర ప్రణవము చేర్చవలెనని భాష్యకర్తల యభిప్రాయము. అపుడు మంగళాంతమై అధిక ఫలదాయకమగును. ధియో యో నః ప్రచోదయాత్ అనెడి శుద్ధగాయత్రి జీవబ్రహ్మైక్యమును బోధించును. మా బుద్ధులను ధర్మకర్మలను గూర్చి ఎయ్యది ప్రేరేపించునో సర్వబుద్ధులకు ప్రకాశము నిచ్చెడి సర్వసాక్షియే ప్రత్యగాత్మ యని పిలువబడును. ప్రచోదయాత్ (ప్రేరేపించునో) అనుశబ్దముచేత చెప్పబడిన ఆత్మకు స్వరూపమైన పరబ్రహ్మము జగత్కర్తృత్వమును తెలిపెడి తత్సవితుః మొదలైన పదములచే వివరింపబడినది. ఓమ్ తత్ సత్ అను మూడు పదములు బ్రహ్మబోధకములని భగవద్గీత వచించినది. కావున తత్ శబ్దముచేత అహం ప్రత్యయసాక్షియైన స్వతస్సిద్ధమైన పరబ్రహ్మము చెప్పబడును. సవితుః అను పదముచే సృష్టి స్థితిలయ లక్షణములు గలిగినదియు సమస్తప్రపంచమునకు ద్వైతవిలాసమునకు అధిష్ఠానమైనదియు బోధింపబడును. వరేణ్యం అనగా అందరిచేత వరింపదగిన నిరతిశయానందము, భర్గః అనగా అవిద్యాదోషములైన కామకర్మాదులను భర్జనము (దహింప) చేసెడి

తేజస్సు. అనగా అజ్ఞానము నశింపజేసెడి జ్ఞానము. దేవస్య అనగా అన్నిటిని ప్రకాశింపజేసెడి అఖండ చిదేకరసమైనది. సవితుః దేవస్య అనుపదములపైనున్న షష్ఠీవిభక్తికి షష్ఠ్యర్థములేదు. రాహోః (రాహువుయొక్క) శిరః అనుచోట రాహుపదముపైనున్న షష్ఠీవిభక్తివలె మాటవరుసకు చేర్చిన విభక్తియే. రాహువే శిరోరూపుడై యుండగా రాహువుయొక్క శిరస్సనుట కర్థమేమున్నది? రాహురూపమైన శిరస్సని ప్రథమార్థము చెప్పవలెను. అట్లే సవితుః జగత్సృష్టియొనర్చు దేవస్య ప్రకాశకుని యొక్క తేజస్సు అన్నప్పుడుకూడ, సవితయైన దేవుడైన భర్గస్సు అని ప్రథమే చెప్పవలెను. సవితృ-దేవశబ్దములు భర్గశ్శబ్దమునకే విశేషణములు. బుద్ధి మొదలగు సర్వదృశ్యములకు సాక్షియైన యే నా స్వరూపము కలదో అది సర్వాధిష్ఠానభూతమై పరమానందమై సమస్తానర్థములను తొలగించెడి స్వయం ప్రకాశమైన చిద్రూపమైన బ్రహ్మము అని ధ్యానింతుము.

ఇట్లు ధ్యానింపగా హిరణ్యగర్భుడు మొదలు వివర్తమైన సమస్త జడప్రపంచముతో సహా రజ్జుసర్ప న్యాయముగ ప్రత్యగాత్మకు బ్రహ్మతో తాదాత్మ్యరూపమైన ఏకత్వము సంభవించును. ఈవిధముగ ఈ గాయత్రీమంత్రము సర్వాత్మకమైన బ్రహ్మమును బోధించును.

ఇచట రజ్జు సర్పన్యాయము అన్వయించును. ఎట్లన : అజ్ఞానముచేత రజ్జువు (త్రాడు) నందు సర్పము ఆరోపింప బడినది. రజ్జువే సర్పముగ భాసించినది. ప్రకాశ సంపర్కము చేత సర్పభావము పోయి రజ్జుభావము కలిగినది. ఇక సర్పము లేదు. రజ్జువు మాత్రమే. సర్పముగచూచినపుడుకూడ అది రజ్జువే. ఇదియే బాధ సామానాధికరణ్యము. అజ్ఞానావరణ చేత బ్రహ్మమందు జీవభావము కలుగుట, జ్ఞానముచేత జీవ భావము నశించి బ్రహ్మభావము కలుగుట యని భావము.

పై దెల్పిన శుద్ధ గాయత్రీమంత్రము తత్త్వమసి యను మహావాక్యమునలె జీవబ్రహ్మైక్యము బోధించునని పెద్దలు వచింతురు. అందు ధియోయోనః ప్రచోదయాత్ అను భాగము త్వంపదార్థమును, తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య అనుభాగము తత్ పదార్థమును, ధీమహి అనునది అసి పదార్థ మును బోధించును.

పై దెల్పిన భాష్యములో గాయత్రీ మంత్రము ప్రణ వాంతముగ జపము చేయవలెనని వ్రాయబడినది. కాని అనుభవములో అటుల లేదు. వ్యాహృతిపూర్వకముగా ప్రారంభించి ప్రచోదయాత్ అను పదముతో వదలివేయు చున్నారు. ఈ విషయమై కృష్ణపండితీయము చూడగా నిట్లున్నది.

"ప్రణవవ్యాహృతియుతాం గాయత్రీం వై జపే త్తతః" అను వ్యాస వచనమును బట్టి ప్రణవవ్యాహృతు

లతో గూడిన గాయత్రిని జపించవలెను. ఇచట ప్రణవాంతముగ అని యనలేదు. కాని

"ఓంకారం పూర్వముచ్చార్య భూర్భువ స్స్వ స్తథైవచ
గాయత్రీం ప్రణవం చాన్తే జప ఏవ ముదాహృతః" అని

యోగయాజ్ఞవల్క్య వచనముగా ఉదాహరింపబడినది. దీని ప్రకారము ప్రచోదయాత్ ఓమ్ అని' ప్రణవాంతమైన జపము చేయవలెనని కనబడుచు విరుద్ధ వచనములుగా గోచరించుచుండగా శ్రీకృష్ణపండితులు ఈవచనమును వానప్రస్థ విషయముగా పేర్కొనినారు. ఇదియుగాక

"గృహస్థో బ్రహ్మచారీచ ప్రణవాద్యామిమాంజపేత్
అన్తే యః ప్రణవం కుర్యాన్నా సౌ వృద్ధి
మవాప్నుయాత్",

అను చంద్రికా వచనము చూపబడినది, ప్రణవాంతముగ జపించిన యెడల వృద్ధి చెందరని దాని యర్థము. ఇట్లు ప్రణవాంతజపము నిషేధింపబడినది. కాని ఆచార్యుల వారి భాష్యమున "ప్రణవాన్తా గాయత్రీ జపాదిభిః ఉపాస్యా" గాయత్రీ జపము ప్రణవాంతముగా చేయవలెనని యున్నది. దీనినిబట్టి రెండు సంప్రదాయము లుండినటుల ఊహింపవలసియున్నది. ఏ సంప్రదాయమువారాసంప్రదాయము ననుసరించి జపింపవలెనని తోచుచున్నది.

7) భా॥ సప్తవ్యాహృతీనా మయమర్థః. భూః ఇతి సన్మాత్రముచ్యతే. భువః ఇతి సర్వం భావం ప్రకాశ

యతీతి వ్యుత్పత్త్యా చిద్రూపముచ్యతే. సువర్ ఇతి సుద్రియతే ఇతి వ్యుత్పత్త్యా సువః ఇతి సుష్ఠు సర్వైః ద్రియమాణ సుఖ స్వరూపముచ్యతే. మహః ఇతి మహీయతే పూజ్యతే ఇతి వ్యుత్పత్త్యా సర్వాతిశయత్వ ముచ్యతే. జనః ఇతి జనయతీతి జనన కారణత్వ ముచ్యతే. తపః ఇతి సర్వతేజో రూపత్వం. సత్యమితి సర్వబాధా రహితత్వమ్.

అ॥ సప్త వ్యాహృతీనాం=ఓం భూః ఓం భువః మొదలగు ఏడు వ్యాహృతులకు, అయ మర్థః = ఇది యర్థము. భూఃఇతి=భూః అనగా సన్మాత్రము, భువః ఇతి=భువః అనగా, సర్వం భావం ప్రకాశయతీతి వ్యుత్పత్త్యా = భావ పధార్థము నంతయు ప్రకాశింప జేయునది అను వ్యుత్పత్తితో చిద్రూపముచ్యతే = చిద్రూపము చెప్పబడును. సువర్ ఇతి = సువర్ అనగా, సుద్రియతే ఇతి వ్యుత్పత్త్యా=బాగుగ వరింప (కోర) బడునను వ్యుత్పత్తితో సువః ఇతి=సువః అనగా, సుష్ఠు = బాగుగా, సర్వైః=అందరిచేత ద్రియమాణ సుఖస్వరూపం = వరింపబడు సుఖ స్వరూపము. ఉచ్యతే=చెప్పబడును. మహః ఇతి=మహః అనగా మహీయతే=పూజ్యతే=పూజింపబడును, ఇతి వ్యుత్పత్త్యా = అనువ్యుత్పత్తిచేత, సర్వాతిశయత్వ ముచ్యతే=అన్నిటికంటె మించినది అని చెప్పబడును. జనః ఇతి=జనః అనగా జనయతీతి = జనయతి అనగా, జననకారణం, ఉచ్యతే=సృష్టికి కారణము చెప్పబడును. తపః ఇతి = తపః అనగా, సర్వ తేజో రూపత్వం=సర్వతేజ స్స్వరూపము, సత్యం ఇతి=సత్య మనగా=సర్వ బాధా రహితమ్=ఏ విధముగాను నశింపనిది.

తా॥ భూః భువః సువః మహః జనః తపః సత్యమ్ ఇవి సప్త వ్యాహృతులు. వీనికి స్థూలముగ ఆయా లోకము

లని యర్థము. ఈ పదములన్నిటికి ముందు ఓక్కారము చేర్చబడినది. కావున ఈ లోకములన్నియు ప్రణవ స్వరూపమని యర్థము. ప్రణవము బ్రహ్మ స్వరూపమని ఉపనిషత్తులు ఏక కంఠముగ బోధించినవి. ముఖ్యముగ మాండూక్యోపనిషత్తు "ఓ మిత్యేతదక్షర మిదగ్ం సర్వం తస్యోప వ్యాఖ్యానం భూతం భవద్భవిష్య దితి సర్వ మోఙ్కార ఏవ" ఈ దృశ్యమాన ప్రపంచ మంతయు ఓం కారమే, భూత వర్తమాన భవిష్యత్కాలములు ఓంకారమే, మఱియు "యచ్చాన్య త్త్రికాలా తీతం తదప్యోంకార ఏవ" త్రికాలములకు మించినది కూడ ఓంకారమే. నచికేతసునకు బ్రహ్మ స్వరూపము చెప్పెదనని యముడు "తత్తేపదం సంగ్రహేణ బ్రవీమి ఓ మిత్యేతత్" అని చెప్పెను. బ్రహ్మ యొక్క సంగ్రహ స్వరూపము ఓంకారమని భావము.

ప్రకృతము భూరాది సప్త వ్యాహృతుల పదముల వ్యుత్పత్తిని బట్టి సచ్చిదానంద రూపమైన పరబ్రహ్మమే అర్థముగ లభించుచున్నది.

ఎట్లన ;....

భూ ధాతువునకు సత్తయని యర్థము. సత్తయనగా ఉండుటయని యర్థము. బ్రహ్మము సత్ చిత్ ఆనంద రూపము. భూ శబ్దము బ్రహ్మయొక్క సద్రూపమును వెల్లడించినది. భువః అనగా భావ పదార్థముల నెల్ల ప్రకాశింప జేయునది యని యర్థము, కావున ఈ పదము చిద్రూపమును

బోధించును. సువర్ అనగా బాగుగ అందరిచే వరింపబడునది అనగా కోరబడునది. అది ఆనందము తప్ప మరేమున్నది? కావున ఈపదము ఆనందమును వెల్లడించును. మహః అనగా (మహీయతే) పూజింపబడునది యని యర్థము. దీనిచే సర్వాతిశాయిత్వము అనగా అన్నిటికంటె మించినదని యర్థము లభించును. అది బ్రహ్మ స్వరూపమే. జనః ఉత్పత్తి చేయునది యని యర్థము. భూత భౌతికముల సృష్టికి కారణ మని భావము ఇది బ్రహ్మ పదార్థమునకే వర్తించును. సత్యమ్ అనగా ఎన్నడును నశింపనిది నిత్యమైనది యని యర్థము. త్రికాలాబాధ్యమైనది బ్రహ్మ పదార్థము తప్ప మరియొకటి లేదు. ఈవిధముగా సప్తవ్యాహృతులును బ్రహ్మ భావమునే బోధించును. మొదట నున్న ప్రణవము బ్రహ్మను బోధించునది గాన తదభిన్నమైన అనగా తత్స్వరూపమైన సత్-ప్రకాశము-ఆనందము మొదలైన అర్థములను సప్త వ్యాహృతులు బోధించును.

భా॥ ఏతదుక్తం భవతి, లోకే స్వరూపం తదోంకార వాచ్యం బ్రహ్మైవ ఆత్మనః అస్య సచ్చిద్రూప స్వభావాదితి। అథ భూరాదయః సర్వేలోకాః ఓ జ్కార వాచ్యాః బ్రహ్మాత్మకాః న తద్వ్యతరిక్తం కించిదస్తీతి వ్యాహృతయః సర్వాత్మక బ్రహ్మ బోధకాః.

తా॥ పై వివరణచేత ఇది చెప్పినట్లగును. ఏమన ఆత్మ సచ్చిద్రూప (సత్-చిత్-రూప) స్వభావము కలిగినదిగాన

అది ఓంకార వాచ్యమైన బ్రహ్మమేః. భూమి మొదలగు లోకములన్నియు ఓంకారవాచ్యమైన బ్రహ్మస్వరూపములే. బ్రహ్మము కన్న వేరుగ ఏమియు లేదుగాన వ్యాహృతులన్నియు సర్వాత్మకమైన బ్రహ్మమునే బోధించును.

8) భా॥ గాయత్రీ శిరసోఽప్యయమేవార్థః. ఆపః ఇతి ఆప్నోతీతి వ్యుత్పత్త్యా వ్యాపకత్వముచ్యతే. జ్యోతిరితి ప్రకాశరూపత్వం (కాశ్ = దీప్తౌ) రసః ఇతి సర్వాతిశయిత్వం. అమృతమితి మరణాది సంసార నిర్ముక్తత్వం. సర్వవ్యాపి సర్వ ప్రకాశకత్వం సర్వోత్కృష్ట నిత్యముక్తత్వం ఆత్మరూపం సచ్చిదానందాత్మకం యదోంకార వాచ్యం బ్రహ్మ తదిహా మస్మీతి గాయత్రీ మంత్రస్యార్థః,

అ॥ గాయత్రీ శిరసః అపి = గాయత్రీ శిరస్సునకు గూడ, అయం ఏవ అర్థః ఈ యర్థమే. ఆపః ఇతి = ఆపః అనగా, ఆప్నోతి ఇతి వ్యుత్పత్త్యా = ఆప్నోతి అనే వ్యుత్పత్తిచేత, వ్యాపకత్వం ఉచ్యతే = వ్యాపించి యుండుట చెప్పబడును, జ్యోతిః ఇతి = జ్యోతిః అనగా ప్రకాశ రూపత్వం = ప్రకాశ రూపముగ నుండుట, రసః ఇతి = రసః అనగా, సర్వాతిశయత్వం = అన్నిటికంటె మించి యుండుట, అమృతం ఇతి = అమృత మనగా మరణాది సంసార నిర్ముక్తత్వం = మరణము మొదలైన సంసారము నుండి విడువబడి యుండుట (తెలియును) సర్వవ్యాపి = అంతటను వ్యాపించినది. సర్వ ప్రకాశకత్వం = అన్నిటిని ప్రకాశింపజేయుట, సర్వోత్కృష్ట = అన్నిటికంటె శ్రేష్ఠమై, నిత్యముక్తత్వం = సర్వ కాలమందు దేనిని అంటకుండ నుండునది. ఆత్మ

రూపం = ఆత్మరూపమై, సచ్చిదానంద రూపం= సత్తు చిత్తు ఆనందము స్వభావము గల, యదోంకారవాచ్యం బ్రహ్మ = ఓం కారవాచ్యమైన ఏ బ్రహ్మకలదో, తదహమస్మి = అది నేనై యున్నాను, ఇతి = అని గాయత్రీ మంత్రస్య అర్థః = గాయత్రీ మంత్రమున కర్థము.

తా॥ "ఓ మాపో జ్యోతీ రసోఽమృతం బ్రహ్మ" అనెడి గాయత్రీ శిరస్సునకు గూడ ఇదియే అర్థము. అనగా పై దెల్పిన ఆత్మ బ్రహ్మల ఏకత్వము. ఎట్లనగా ఆపః అను పదమునకు ఆప్నోతి అను వ్యుత్పత్తి చేత వ్యాపకత్వము అర్థము. జ్యోతిః అనగా ప్రకాశ రూపత్వము, రసః అనగా అన్నిటిని మించినదని యర్థము. అమృత మనగా మరణ ధర్మము నుండి ముక్తమైనది. ఇట్లు సర్వ వ్యాపకము సర్వ ప్రకాశకము సర్వోత్కృష్టము నిత్యముక్తము సచ్చిదానందాత్మకము ఓంకారవాచ్యమునగు ఏ బ్రహ్మము కలదో అదియే నేనని గాయత్రీ మంత్రమున కర్థము. గాయత్రీ శిరస్సునకును వ్యాహృతులకును ఇదియే యర్థము.

9) భా॥ శ్లో॥ 1. గుహాశయే బ్రహ్మహుతాశనేఽహం
కర్త్రాదమంశాఖ్య హవిర్హుతం సత్ ॥
విలీయతే నేదమహం భవాని
త్యేష ప్రకార స్త్వభి దీయతేఽత్ర॥

2. యదస్తి యద్భాతి తదాత్మరూపం
నాన్యత్తతో భాతి నచాన్యదస్తి।

స్వభావ సంవిత్ ప్రతిభాతి కేవలా
గ్రాహ్యం గ్రహీతేతి మృషైవ కల్పనా॥

1. పదవిభాగము: గుహాశయే-బ్రహ్మహుతాశనే-అహంకర్త్రృ-ఇదమంశాఖ్యహవిః-హుతం సత్ విలీయతే-న ఇదం-అహం-భవాన్-ఇతి-ఏషః-ప్రకారః-తు-అభిధీయతే - అత్ర. (కర్త్రీలోని దీర్ఘము ఆర్షము)

అర్థము ;- గుహాశయే = బుదిగుహయందుండెడి. బ్రహ్మహుతాశనే = బ్రహ్మమనెడు అగ్నియందు, అహంకర్త్రృ = అహంకారము, ఇదమంశాఖ్యహవిః = ఇది అనగా దృశ్యపదార్థమను హోమద్రవ్యము, హుతంసత్ = వ్రేల్చబడినదై, (అంతట) ఇదం = ఇది, అహం = నేను (కర్తృత్వము) భవాన్ ఇతి = నీవు అను భావము, విలీయతే = నశించిపోవును అత్ర = ఈ గాయత్రీ మంత్రమునందు, ఏషప్రకారః ఈ విధానము, అభిధీయతే = చెప్పబడుచున్నది.

తా॥ బ్రహ్మను గుర్తించుటకు తావు మానవుల బుద్ధిగుహ యని ఉపనిషత్తులు తెల్పును. కఠోపనిషత్తు బ్రహ్మను బోధించుచు-

"తం దుర్దర్శం గూఢమనుప్రవిష్టం గుహాహితం గహ్వరేష్ఠం పురాణమ్" అని ద్వితీయ వల్లిలో 12వ ఋక్కునందు గుహాహితం అనగా మానవుల బుద్ధి గుహలో నెలకొని యున్నదని చెప్పెను. బుద్ధి గుహలో నున్న బ్రహ్మమను అగ్నిహోత్రములో అహంకారమను దృశ్య ప్రపంచమును

హోహామను చేయవలెను. అప్పుడు నేను నేను ఇది అను భావములు నశించును. అనగా నిరంతర బ్రహ్మచింతన వలన దేహేంద్రియాదుల యందు ఆత్మభావము నశించి జీవుడు బ్రహ్మమాత్రుడుగ నుండును. ఇదియే గాయత్రీ మంత్రమున నుపదేశింప బడినది.

2. ప. వి. ;- యత్-అస్తి - యత్ -భాతి-తత్ -ఆత్మరూపం-న-అన్యత్ -తతః-భాతి-న-చ-అన్యత్ -అస్తి-స్వభావ సంవిత్ -ప్రతిభాతి-కేవలా-గ్రాహ్యం-గ్రహీతా - ఇతి-మృషా-ఏవ-కల్పనా.

అ॥ యత్ అస్తి = ఏది యున్నదో, యత్ భాతి = ఏది ప్రకాశించు (తెలియు) చున్నదో, తత్ = అది ఆత్మరూపమ్ = ఆత్మస్వరూపము, తతః అన్యత్= దాని (ఆత్మ) కంటె వేరైనది, న భాతి= ప్రకాశింపదు, అన్యత్ = మరియొక పదార్థము, న అస్తి = లేదు, స్వభావ సంవిత్ = తనంతట తాను వెలసినజ్ఞానము, కేవలా = ఒక్కటియే ప్రతిభాతి = ప్రకాశించుచున్నది. గ్రాహ్యం = దృశ్యము, గ్రహీతా ఇతి = ద్రష్టయని. మృషా = అసత్యమైన, కల్పనా ఏవ = కల్పనయే.

తా॥ శ్లో॥ అస్తి భాతి ప్రియం నామ రూపం చేత్యంశ పంచకమ్,। ఆద్యత్రయం బ్రహ్మరూపం జగద్రూప మనస్తరమ్॥ అను విద్యారణ్య సూక్తి ననుసరించి సత్ చిత్ ప్రియ యములు బ్రహ్మ స్వరూపములు. నామ రూపములు జగద్రూపములు. ఈ యర్థమే యిందు వివరింపబడినది. సృష్టి

యందు ఏది ఉన్నది. అని వ్యవహరింపబడునో ఏది తెలియ బడుచున్నదో ఏది ప్రియమైనదో అదంతయు ఆత్మరూపమే. ఆత్మకంటె వేరైనదెద్దియులేదు, ప్రకాశింపదు. స్వభావసిద్ధమై ఉదయాస్తమయములు లేని యీ జ్ఞాన మొక్కటియే యున్నది. దృశ్యము ద్రష్ట అనునదంతయు అసత్యమగు కల్పనము. ఈ భావమే గాయత్రీ మంత్రము బోధించుచున్నది.

శ్రీ గాయత్రీ మంత్రార్థ ప్రకరణము

సమాప్తము

ఓమ్ తత్ సత్

# గాయత్రీ హృదయము

సంధ్యావందనములో గాయత్రీ జపమునకు పూర్వము "ఓ మిత్యేకాక్షరం బ్రహ్మ" ఇత్యాది మంత్రము పఠింప వలెను. అదియే గాయత్రీ హృదయమని శౌనక మహర్షి సెలవిచ్చెను.

"ఓ మిత్యేకాక్షరం బ్రహ్మేత్యేతద్ధృదయ ముచ్యతే గాయత్ర్యా స్తత్పఠిత్వాదౌ జపకర్మ సమాచరేత్" అనగా ఓ మిత్యేకాక్షరం బ్రహ్మ ఇత్యాది మంత్రము గాయత్రికి హృదయము. కావున దానిని పఠించి మంత్రజపము చేయ వలెను.

మంత్రము : ఓ మిత్యేకాక్షరం బ్రహ్మ, అగ్నిర్దేవతా, బ్రహ్మ ఇత్యార్షమ్, గాయత్రం ఛందం, పర మాత్మమ్సరూపమ్. సాయుజ్యం వినియోగమ్.

ఈ మంత్రమున గాయత్రీ పదమునకు గాయత్రం అనియు, ఋషిః అనుటకు ఆర్షమ్ అనియు, పరమాత్మకు పరమాత్మం అనియు ప్రయోగింపబడెను. అవి వైదిక ప్రయోగములు,

ఈ మంత్రమునందు ప్రణవ బోధ్యమైన పరబ్రహ్మ ధ్యానము గోచరించుచున్నది. గాయత్రీ మంత్రము బ్రహ్మ

బోధకమైనందున గాయత్రీ ఉపాసనకు ముందుగ బ్రహ్మ బోధకమైన గాయత్రీ హృదయ పఠనము నియమింపబడినది. ఈ ప్రణవ మంత్రమునకు ఋషి ఛందో దేవతాదులు పేర్కొనబడినవి. అవి సంప్రదాయ బద్ధములే కాని అన్నియు బ్రహ్మ బోధకములే యని ప్రమాణములను బట్టి తెలియుచున్నది.

సోహం అనెడి పరమహంస మంత్రములో సకార హకారములు లోపించి ఓమ్ ఆవిర్భవించెనని శ్రీ శంకరాచార్యుల వారి ప్రపంచ సారములో మంత్ర సృష్టి ప్రకరణములో చెప్పబడినది. ఎట్లన-

"యోయం పరమ హంసాఖ్యో మన్త్రః "సోఽహ"

మితీరితః

స హాల్లోపేఽస్య పూర్వశ్చ సన్ధావోమితి జాయతే."

ఇట్లు విడదీసి తెలిసికొనవలెను.

స్ + ఓ = సో; అ + హమ్ = అహమ్

[సకార హకారములు లోపింపగా]

ఓ + అమ్; పూర్వరూప సంధి వలన 'అ' లోపించి ఓమ్ అగును. సోఽహం అను మంత్రమునే ఓమ్ తెల్పును. ఆ పరమాత్మయే నేనని భావము.

అచటనే శంకరులు :

"ఓ మిత్యే కాక్షరం బ్రహ్మ ధ్యాయన్నేవ

జపన్ ద్విజః

అవాప్త సర్వకామోఽసా వాత్మతత్త్వాయ కల్పతే"
ఓ జ్కారముతో పరబ్రహ్మ స్వరూపమును ధ్యానించుచు దానిని జపించు ద్విజుడు ఎల్లకోర్కెలను పడసి ఆత్మతత్త్వము నధిగమించును. అట్టి ఓంకారమునకు ఋష్యాదులను పేర్కొనుచున్నాడు. అగ్నిః = అంగతి అను ధాతువునుండి అగ్ని శబ్దము పుట్టినది. నడుమనున్న అనుస్వారము లోపించి చివర 'ని' ప్రత్యయము చేరగా అగ్ని అను రూప మేర్పడినది. అంగతి = సకల వేదాన్త వ్యాపకత్వము పొందు నది అనగా పరమాత్మయే. కావున ప్రణవ మంత్ర మునకు (అగ్ని) పరమాత్మ దేవత, బ్రహ్మ ఇతి = పర బ్రహ్మము, ఆర్షం = ఋషి, గాయత్రం ఛందం = గాయత్రి ఛందస్సు, పరమాత్మం సరూపం = పరమాత్మ స్వరూపము (ప్రణవము పరమాత్మ స్వరూపమనుట) సాయుజ్యం విని యోగం = మోక్షమందు వినియోగము, ఈ విధముగ ప్రణవ స్వరూపము నెరుంగనలెను.

# గాయత్రీ ప్రార్థనము

ఆయాతు వరదా దేవీ అక్షరం బ్రహ్మసమ్మితం!
గాయత్రీం ఛందసాం మాతేదం బ్రహ్మజుషస్వమే।
యదహ్నాత్ కురుతే పాపం తదహ్నాత్ ప్రతిముచ్యతే!
యద్రాత్ర్యాత్కురుతే పాపం తద్రాత్ర్యాత్ప్రతి
ముచ్యతే।
సర్వవర్ణే మహాదేవి సంధ్యావిద్యే సరస్వతి॥

వరదా = ఉపాసకుల కభీష్ట మొసంగెడి, దేవీ = నిత్యానంద సంపన్నమైనది, ఆయాతు = (మమ్మనుగ్రహించుటకై మా చెంతకు) వచ్చుగాక! ఆమె యెట్టిదన అక్షరం = నాశరహితమైనది, సమ్మితం = ఉపనిషత్ప్రమాణములచే నిశ్చయింపబడిన, బ్రహ్మ = బ్రహ్మము నీవే కద ! గాయత్రీం = గాయత్రీదేవి, ఛందసాం మాతా = వేదములకు తల్లి, సకల వేద సారము. ఈ విషయములో మనుస్మృతి.

త్రిభ్య ఏవ తు వేదేభ్యః పాదం పాద మదూదుహత్
తది త్యృచోఽస్యా స్సావిత్ర్యాః పరమేష్ఠీ ప్రజాపతిః

ఋగ్యజుస్సామములనెడు మూడు వేదముల నుండి గాయత్రియొక్క ఒక్కొక్క పాదమును బ్రహ్మదేవుడు వెలికి తీసెనని భావము. ఇదం బ్రహ్మ = (బ్రహ్మ = తపస్సు) ఈ స్తుతి రూపమైన తపస్సును జుషస్వ = అనుగ్రహింపుము. జపమునకు ఐహిక ఫలము :-

యదహ్నాత్కురుతే పాపం తదహ్నాత్ ప్రతిముచ్యతే
యద్రాత్ర్యాత్కురుతే పాపం తద్రాత్ర్యాత్ ప్రతిముచ్యతే

ఈ మంత్రములో సప్తమీ విభక్తి స్థానమున పంచమీ విభక్తి కనబడును. అవి లౌకిక వ్యాకరణమున కందవు.

అ॥ అహ్నాత్ = పగటియందు, యత్ పాపం కురుతే = ఏ పాపము చేయునో తత్ = అది, అహ్నాత్ = పగటియందే, ప్రతిముచ్యతే (జప ప్రభావముచే) విడువబడును. రాత్ర్యాత్ = రాత్రియందు యత్ పాపం = ఏ పాపము, కురుతే = చేయునో, తత్ = అది, రాత్ర్యాత్ = రాత్రియందే, ప్రతిముచ్యతే = విడువబడును.

అర్థజ్ఞాన సహితమైన గాయత్రీ జపము వలన జీవుడు పాపముల నుండి విముక్తుడగును.

## గాయత్రీ దేవతాహ్వానము

సర్వవర్ణే మహాదేవి సంధ్యా విద్యే సరస్వతి; ఓజోఽసి సహోఽసి బలమసి భ్రాజోఽసి దేవానాం ధామనామాఽసి విశ్వమసి విశ్వాయుః సర్వమసి సర్వాయుః అభిభూరోమ్ గాయత్రీ మావాహయామి సావిత్రీ మావాహయామి సరస్వతీ మావాహయామి ఛన్దర్షీ నావాహయామి శ్రియ మావాహయామి

అ॥ సర్వవర్ణే = సకలవర్ణ స్వరూపిణీ! సరస్వతి = సరస్వతీ స్వరూపిణీ! సంధ్యావిద్యే = సంధ్యా కాలమున తెలియవగిన,మహాదేవి = సర్వాధిక దేవతా! ఓ గాయత్రీ (నీవు) ఓజః అసి = ఇంద్రియములశక్తివై యున్నావు. సహః అసి = శత్రువుల నెదుర్కొను సామర్థ్యమై యున్నావు. బలం అసి = పుష్టి రూపిణివి, భ్రాజః అసి = తేజోరూపిణివి, దేవానాం = ఇంద్రాగ్ని వరుణాదుల, ధామ = నివాస స్థానమవు, అసి నామ = అయియున్నావు కదా!

తా॥ ఓ గాయత్రీ నీవు సకల వర్ణ స్వరూపిణివి, సంధ్యా కాలమున తెలియదగినదానవు, నీవే సరస్వతివి సర్వాధిక దేవతవు. మానవుల ఇంద్రియ శక్తినీవే, శత్రువుల నెదిర్కొను సామర్థ్యము నీవే. దేహపుష్టి తేజస్సు అన్నియు నీవే. ఇంద్రాగ్న్యాదుల నివాసము కూడ నీవే.

అ॥ విశ్వం = సర్వస్థావర రూపము, అసి = అయియున్నావు. విశ్వ + ఆయుః = సర్వ స్థావర సత్తయు నీవే, సర్వం అసి = నిఖిల జంగమ స్వరూపవై యున్నావు, సర్వం + ఆయుః = సమస్త జంగమ సత్తా స్వరూపిణివి ఐయున్నావు. అభిభూః + ఓమ్ = నిఖిల పాపములను తిరస్కరించెడి ప్రణవ ప్రతిపాద్యమైన పరబ్రహ్మ స్వరూపిణివి, అటువంటి, గాయత్రీం = గాయత్రీదేవివైన నిన్ను ఆవాహయామి = (ఉపాసించుటకై) పిలుచుచున్నాను. సావిత్రీం ఆవాహయామి = సావిత్రి యను పేరుగల నిన్ను, ఆవాహయామి = ఆహ్వానము చేయుచున్నాను. సరస్వతీం ఆవాహయామి = సరస్వతియను పేరుగల నిన్ను, ఆవాహయామి = ఆహ్వానము చేయుచున్నాను. ఛంద + ఋషీన్ ఆవాహయామి = గాయత్రి మొదలైన ఛందస్సులను, విశ్వామిత్రాదులగు ఋషులను ఆహ్వానించుచున్నాను. శ్రియం = శ్రయన్తి ఏతా మితి శ్రీః = అందరు ఎవరి నాశ్రయింతురో ఆమె శ్రీ = లక్ష్మి, ఆమె నాశ్రయించుచున్నాను.

తా॥ గాయత్రీ నీవు స్థావర జంగ మాత్మక సకల ప్రపంచ స్వరూపమైన దానవు. పాప పుంజములను తరిమి వేయు ఓంకార ప్రతిపాద్యమైన పరబ్రహ్మ స్వరూపిణివి. అటువంటి నిన్ను ఉపాసించుటకై నా యొద్దకు రమ్మని ఆహ్వానించుచున్నాను. ఉదయమున గాయత్రి యనియు మధ్యాహ్నము సావిత్రి యనియు, సాయంకాలము సరస్వతి యనియు వ్యవహరింపబడు నిన్ను పలుమాఱు పిలుచు చున్నాను. ఈ విషయము పరాశర మాధవీయములో-

"గాయత్రీ నామ పూర్వాహ్ణే సావిత్రీ మధ్యమే దినే
సరస్వతీ చ సాయాహ్నే సైవ సంధ్యా త్రిధా మతా॥
అని తెలుపబడినది.

నన్ననుగ్రహించుటకై గాయత్ర్యాది ఛందస్సులను, విశ్వామిత్రాదులైన ఋషులను పిలుచుచున్నాను. అందరికీ ఆశ్రయమగు లక్ష్మీదేవి నాహ్వానించుచున్నాను. శ్రీ శబ్దము సత్వుల కాశ్రయమను వ్యుత్పత్తిలో సర్వాధిష్ఠానమైన బ్రహ్మస్వరూపమని కూడ అర్థము వచ్చును.

## ఛందో ఋష్యాదులు

గాయత్ర్యా గాయత్రీ చ్ఛందో విశ్వామిత్ర ఋషిః సవితా దేవతా అగ్నిర్ముఖంబ్రహ్మశిరో విష్ణుర్ హృదయగ్ం రుద్రశ్శిఖా పృథివీ యోనిః ప్రాణాపాన వ్యానోదాన సమానా సప్రాణా శ్వేతవర్ణా, సాంఖ్యాయన సగోత్రా గాయత్రీ చతుర్వింశత్యక్షరా త్రిపదా షట్కుక్షిః పంచశీర్షోపనయనే వినియోగః।

అ॥ గాయత్ర్యాః = గాయత్రీ మంత్రమునకు, గాయత్రీ = గాయత్రి యను పేరు గల, ఛందః = ఛందస్సు, విశ్వామిత్రః = విశ్వామిత్రుడు ఋషిః = ఋషి, సవితా = సూర్యుడు, దేవతా = దేవత, అగ్నిః = అగ్నియే, ముఖం = ముఖము, బ్రహ్మ = పరమేష్ఠి, శిరః = శిరస్సు, విష్ణుః = విష్ణువు, హృదయం = హృదయము, రుద్రః = రుద్రుడు, శిఖా = శిఖ, పృథివీ = భూమి, యోనిః = యోని; ప్రాణ + అపాన + వ్యాన + ఉదాన + సమానా = ప్రాణము, అపానము, వ్యానము,

ఉదానము, సమానము అను ఐదు వాయువుల స్వరూపమైనది, సప్రాణా = ఐదు ఉపప్రాణముల (దేవదత్త కూర్మాది) రూపమైనది. శ్వేతవర్ణా = తెలుపు వన్నె కలది, సాంఖ్యాయన సగోత్రా = సాంఖ్యాయన ఋషి యొక్క గోత్రము కలది. చతుర్వింశతి + అక్షరా = ఇరువది నాలుగక్షరములు కలది, త్రిపదా = మూడు పాదములు కలది, షట్కుక్షిః = ఆరు వేదాంగములు - లేదా నాలుగు దిక్కులు + పైన క్రింద = ఈ ఆరు దిక్కులు కుక్షిగా గలది, పంచశీర్షా = నాల్గు వేదములు, ఇతిహాస పురాణములు ఈ యైదు శిరస్సులుగా గలది. వినియోగః = దీని ఉపయోగము, ఉపనయనే = ఉపనయన కర్మయందు కలుగును (ఉప = (గురు) సమీపమునకు, నయనమ్ = (వటుపును) పంపుట = అధ్యయనార్థము గురువు నొద్దకు పంపెడి చర్య ఉపనయనము.)

## గాయత్రీ ధ్యానము

ముక్తా విద్రుమ హేమనీల ధవళచ్ఛాయైర్ముఖై స్త్రీక్షణైః
యుక్తామిందునిబద్ధ రత్నమకుటాం తత్త్వార్థ వర్ణాత్మికామ్॥
గాయత్రీం వరదాభయాంకుశకశాః శుభ్రం కపాలంగదామ్
శంఖం చక్ర మథారవిందయుగళం హస్తై ర్వహంతీంభజే॥

అ॥ ముక్తా = ముత్తెములు, విద్రుమ = పగడము, హేమ = బంగారము, నీల = నీలిరంగు, ధవళచ్ఛాయైః = తెలుపువన్నెలుగలిగి, త్రి + ఈక్షణైః = మూడుకన్నులుగల ముఖైః = ముఖములతో, యుక్తాం = కూడినది, ఇందు నిబద్ధరత్నమకుటాం = చంద్రకళచేత అలంకరింపబడిన రత్నకిరీటము కలదియు, తత్త్వార్థవర్ణాత్మికాం = బ్రహ్మతత్త్వము బోధించెడి తత్సవితుర్వరేణ్యం మొదలగు అక్షరములే స్వరూపముగా కలదియు, వరద +

అభయ + అంకుశ + కశాః, వరద = వరములిచ్చేడి ముద్ర, అభయ = అభయమొసంగు ముద్ర, అంకుశ = అంకుశము, కశాః = కొరడా శుభ్రం = తెల్లని, కపాలం = తలపుర్రెయు, గదాం = గదను, శంఖం చక్రం = శంఖమును, చక్రమును, అథ = మఱియు అరవిందయుగళం = రెండుతామరపూవులను, హస్తైః = (పది)చేతులతో వహన్తీం = ధరించు చున్న, గాయత్రీం = గాయత్రీదేవిని, భజే = సేవించుచున్నాను.

తా॥ గాయత్రీదేవియొక్క సగుణస్వరూపమును ధ్యానించుట. గాయత్రీదేవికి 5 శిరస్సులు, 10 చేతులు, ప్రతి ముఖమున మూడు నేత్రములు, ప్రతిశిరస్సుపై చంద్ర రేఖగల రత్నకిరీటము, పదిచేతులందు వేర్వేరు ముద్రలు, వస్తువులు. ఆమెను కుడి నుండి ఎడమకు చూడవలెను. ఒక చేయి వరమిచ్చేడి ముద్ర మరియొకటి అభయమిచ్చుముద్ర. ఇట్లే అంకుశము, కొరడా, కపాలము, గద, శంఖము, చక్రము ఒక్కొక్క కమలము కలిగియున్నది. మోముల రంగులు- ముత్తెపురంగు, పగడపురంగు, బంగరురంగు, నీలి రంగు, తెలనిరంగు కలిగి గాయత్రీదేవి మహావాక్యాది తత్త్వబోధక వర్ణములే తన స్వరూపముగా గలిగినది. ఇట్టి గాయత్రీదేవిని సేవించుచున్నాను.

ii. యోదేవ స్సవితాఽస్మాకం ధియో ధర్మాది గోచరాః
ప్రేరయే త్తస్య యద్భర్గః తద్వరేణ్య ముపాస్మహే॥

అ॥ సవితా = జగత్ప్రసవితయైన, యః దేవః = ఏ స్వయంప్రకాశ మానుడగు దేవుడు, ధర్మాదిగోచరాః = ధర్మాదులందు సంచరించెడి, అస్మాకం = మా యొక్క, ధియః = బుద్ధివృత్తులను, ప్రేరయేత్ = ప్రేరేపించునో, తస్య =

ఆదేవుని యొక్క, యత్ భర్గః = ఏ తేజస్సు కలదో, వరేణ్యం = శ్రేష్ఠమైన, తత్ భర్గః = ఆ తేజస్సును, ఉపాస్మహే = ఉపాసించుచున్నాము.

తా॥ ఇది గాయత్రీమంత్రమునకు పద్యరూపమైన అర్థము. స్వయం ప్రకాశమానమగు ఏజ్ఞానమయ తేజస్సు జీవుల బుద్ధివృత్తులను ధర్మాదివిషయములందు ప్రవర్తింప జేయునో సర్వోత్తమమైన ఆ తేజస్సును ధ్యానించు చున్నాము.

# శ్రీ విద్యారణ్యకృత శ్లోకరూప గాయత్రి మంత్రార్థము

## తైత్తిరీయ సంధ్యా భాష్యము

1 శ్లో॥ తదిత్యవాఙ్మనోగమ్యం ధ్యేయం సవితృమండలే
సవితు స్సకలోత్పత్తి స్థితి సంహార కారిణః ।

2 వరేణ్య మాశ్రయణీయం యదాధార మిదం జగత్
భర్గః స్వసాక్షాత్కారే ణావిద్యా తత్కార్యదాహకమ్।

3 దేవస్య ద్యోతమానస్య ధ్యాయనస్త్రీక్రీడతో ఽపి వా
మహ్యమహం స ఏవేతి తేనైవాభేదసిద్ధయే ।

4 ధియో ఽన్తః కరణవృత్తీశ్చ ప్రత్యక్ప్రవణచారిణీః
య ఇత్యలింగం ధర్మం యత్ సత్యజ్ఞానాదిలక్షణమ్।

5 నో ఽస్మాకం బహుధా భ్యస్త భిన్న భేద దృశాం తథా
ప్రచోదయాత్ ప్రేరయతు ప్రార్థనేయం విచార్యతామ్।

అ॥ తత్ = అవాఙ్మనో గమ్యం సవితృమండలే ధ్యేయం = వాక్కునకు మనస్సునకు గోచరింపనిది సూర్యమండలమున ధ్యానింపదగినది.

సవితుః = సకలోత్పత్తిస్థితిసంహారకారిణః = సమస్త సృష్టియొక్క పుట్టుకకు ఉనికికి నాశనమునకును కారణమైన

వరేణ్యం = ఆశ్రయణీయం యదాధారమిదంజగత్ = ఈ ప్రపంచము దేనిపై నాధారపడియున్నదో అట్టి ఆశ్రయింపదగినది.

భర్గః = స్వసాక్షాత్కారేణ అవిద్యా తత్కార్యదాహకమ్ = తాను సాక్షాత్కరించుట వలన అవిద్యను, తత్కార్యములను దహింపజేయునది.

దేవస్య = ద్యోతమానస్య హి ఆనన్దాత్ క్రీడతః అపివా = ప్రకాశించుచున్న లేక ఆనందముతో ఆడుచున్న

ధీమహి = అహం స ఏవేతి తేనైవ అభేదసిద్ధయే = నేనే అతడని అతనితో అభేదము సిద్ధించుటకై అతడే నేనని ధ్యానింతును.

ధియః = అన్తఃకరణ వృత్తీఃచ ప్రత్యక్ప్రవణచారిణీః = ఆత్మాభిముఖముగ సంచరించెడి అంతఃకరణవృత్తులను

యః = ఇత్యలింగంధర్మం యత్ సత్యజ్ఞానాదిలక్షణమ్ = ఏది స్త్రీ పుమాదిలింగములు లేనిది సత్యము, జ్ఞానము మొదలగు లక్షణములుకల ఏ ధర్మము కలదో

నః = అస్మాకం బహుధాభ్యస్త భిన్నభేదదృశాం తథా = అనేక విధములుగ కనబడుచున్న ప్రపంచమును భేదదృష్టితో చిరకాలము అనుభవించుచున్న మాకు

ప్రచోదయాత్ = ప్రేరయతు ప్రార్థనాశయం, విచార్యతామ్ = ప్రేరేపించుగాక యను ప్రార్థన యీ గాయత్రీ మంత్రముయొక్క అర్థమని తెలిసికొందురు గాక!

తా॥ చిరకాలము నుండి అనేక దృశ్యములను చూచుచు భేదదృష్టికి అలవాటుపడియున్న మా బుద్ధివృత్తులను ధర్మకర్మలవైపు ప్రేరేపణ చేయు ఏ జ్ఞానమయ తేజము కలదో, ఎయ్యది సృష్టిస్థితిలయ హేతువైనదో ఎయ్యది అవాఙ్మనసగోచరమైనదో, ఎయ్యది స్త్రీపుమాది లింగరహితమో, దేనిని సాక్షాత్కరించుటచే అవిద్యా తత్కార్యములు నశించునో అట్టి స్వయంప్రకాశమైన సర్వోత్తమమైన తేజ (భర్గ) మును నా స్వరూపముగ ధ్యానించుచున్నాను. ఇట్లు జీవపరమాత్మల యభేదము ధ్యానింపబడుటయే గాయత్రీ మంత్రము యొక్క సారాంశము.

# ఛందో విమర్శ

భగవద్గీత విభూతి (10) యోగమును వ్యాఖ్యానించుచు శ్రీ జెల్లంకొండ రామరాయ కవీంద్రులు తమ భాష్యార్క ప్రకాశిక యందు గాయత్రీదేవతను గాయత్రీ ఛందస్సును గూర్చి యిట్లు చర్చించిరి.

"బృహత్సామ తథా సామ్నాం గాయత్రీ ఛందసామహమ్।
మాసానాం మార్గశీర్షోఽహం ఋతూనాం కుసుమాకరః॥

అ॥ సామములలో బృహత్సామమను పేరుగల సామము నేనగుచున్నాను. "త్వామిద్ధి హవామహే" అను ఋక్కునందు గానము చేయబడు సామము

బృహత్సామ మనబడును. ఉష్ణిక్ అనుష్టుప్ త్రిష్టుప్ మున్నగు ఛందస్సులలో గొప్పదగు గాయత్రీ ఛందస్సు నారూపము- అనగా భగవద్విభూతి. ఇచట వైదికమైన గాయత్రీ ఛందస్సునే తీసికొనవలెను. లౌకికమైన గాయత్రీ ఛందస్సు వేరొకటి కలదని పింగళముని పేర్కొనెను. అందు పాదమున కారేసి యక్షరములు గల నాల్గు పాదము లుండును.

ఉ :- మారాయుధభూతా - బాలా శఫరాక్షీ; కాంతం హారిమాంగా - లక్ష్మీ స్తనుమధ్యా. దీనికిని వైదిక గాయత్రి కిని సంబంధము లేదు. వైదిక గాయత్రికి ఎనిమి దేసి యక్షర ములు గల మూడు పాదములు, మూడెనను ఆరైనను అక్షర ములు 24 కదా! రెండును ఒకటే యనవచ్చునుకదా! యనిన అది పొసగదు. ఆరక్షరముల పాదములను 8 గా లెక్కించి నను, 8 అక్షరముల పాదములను 6 అక్షరములుగా విడదీసి నను యతిభంగము కలుగును. తత్సవితుర్వరేణ్యం, భర్గో దేవస్య ధీమహి, ధియో యోనః ప్రచోదయాత్. ఎనిమిదేసి అక్షరములు గల ఈ మూడు పాదములు గల ఛందస్సునకు గాయత్రీ ఛందస్సని పేరు. ఇందు మొదటి పాదములో ఏడక్షరములే కనబడును. కాని "ణ్యమ్" అను అక్షరమును 'ణియమ్' అని రెండక్షరములుగా పరిగణించుట సంప్రదాయ ముగ వచ్చినందున ఎనిమిది అక్షరములు సరిపోవును. గాయత్రీ ఛందోబద్ధమైన "ఉదుత్యం జాతవేదసం" అను మంత్రములో "దృశే విశ్వాయ సూర్యమ్" అను పాదము

నందు "సూరియం" అను మూడక్షరములుగ సరిపెట్టుకొన వలెను. బృహదారణ్యకోపనిషత్తు (5-14-3) లో గాయత్రీ ఛందస్సును నిరూపించుచు "ప్రాణోఽపానో వ్యాన" ఇత్యష్టావక్షరాణి అని వ్రాయబడెను. ఇది యెనిమిదక్షరములు కల గాయత్రీ ఛందస్సుయొక్క పాదమని చెప్పబడెను. ఇచట "ప్రాణ-అపాన-వియన" అని వ్యాన శబ్దమును మూడక్షరములుగ విభజింపవలెను. ఈవిషయమును పింగళాచార్యకృత వైదికఛందశ్శాస్త్రము సమర్థించుచున్నదని పండిత శ్రీ కనుపర్తి మార్కండేయశర్మగారు తమ నిత్యకర్మాష్టకములో వివరించిరి.

సూ. ఇయాది పూరణః ౩-౨

తత్రాయమర్థః యత్ర గాయత్ర్యాది ఛందసి పాదస్యాక్షర సంఖ్యా నపూర్యతే, తత్రేయాదిభిః పూరయితవ్యా యథా" "తత్సవితుర్వరేణ్యమ్" అనగా- ఇయాది పూరణః అను సూత్రమున కిది యర్థము. ఎక్కడ గాయత్రి మున్నగు ఛందస్సునందు పాదమునకు అక్షరసంఖ్య చాలదో అక్కడ "ఇయ" మొదలగు విభజనతో పూరింపవలెను. ఎట్లన— "తత్సవితుర్వరేణ్యమ్" అను పాదములో ఏడక్షరములు కనబడుచున్నవి. కావున "ణ్యమ్" అనుదానిని "ణియమ్" అని విడదీసి లెక్కించుకొనవలెను. అది లెక్కకు మాత్రమే కాని "ణ్యమ్" అని కలిపియే ఉచ్చరింపవలెను. తక్కిన చోటులందును- ఇటులనే గ్రహింపవలెను. ఓంకారమును

కలిపి ఎనిమిదక్షరములు అని సమర్థించుట ప్రామాణికము కాదు. "పరోరజసిసావదోమ్" అనునది గాయత్రీ మంత్రముయొక్క నాల్గవపాదమను నానుడి కలదుకాని అది యసంగతము. అది యథర్వణవేదములోనిది. గాయత్రితో కలిపి ఉపదేశించుటకు వీలుకాదు. దాని నుపదేశము పొందవలెనన్న మరల ఉపనయనము చేయవలెనని తైత్తిరీయ సంధ్యాభాష్యము తెలుపుచున్నది. అట్లయిన గాయత్రియొక్క నాల్గవపాదముగ దీనికి వ్యవహార . మెట్లు కలిగినది? అనగా మంత్రశాస్త్రములో "పరోరజసిసావదోమ్" అను మంత్రమును చేర్చిన గాయత్రి చతుష్పాత్ గాయత్రి యను పేర నొక మంత్రముగా వ్రాయబడినది. అది సంధ్యావందనముతో సంబంధము లేని ప్రత్యేక మంత్రము. దాని వివరణము ఆమ్నాయ మందారములో నిట్లున్నది.

# అథ చతుష్పాద్గాయత్రీ

అస్యశ్రీ చతుష్పాద్గాయత్రీ మహామంత్రస్య విమల ఋషిః, గాయత్రీఛందః। పరమాత్మా దేవతా। తత్సవితుర్వ రేణ్యమితి బీజమ్। భర్గోదేవస్య ధీమహీతిశక్తిః। ధియోయోనః ప్రచోదయాదితికీలకమ్। జపే వినియోగః। తురీయ పాదయుక్తా గాయత్రి ద్వాత్రింశదక్షరా। అష్టకుక్షిః। సప్త శీర్ష్ణా।

సప్రణవ వ్యాహృతి త్రయేణ పాదచతుష్టయేన సమస్తేన చ న్యాసః ।

పరో హృదయాయ నమః। రజసే శిరసే స్వాహా, అసావదోమ్ శిఖాయై వషట్। పరోరజసే కవచాయహుం। అసావదోమ్ నేత్రత్రయాయ వౌషట్। రజసే సావదోమ్ అస్త్రాయ ఫట్।

ధ్యానమ్ : హృదివికసిత పద్మం సార్క సోమాగ్నిబింబం
ప్రణవమయ మచింత్యం యస్య పీఠం ప్రకల్ప్యమ్
అచల పరమసూక్ష్మం జ్యోతిరాకాశసారం
భవతు మమ ముదేఽసౌ సచ్చిదానందరూపః॥

శ్లో॥ దేవీం తురీయ గాయత్రీం తుర్యాతీత పదాశ్రియామ్
పరో రజః ప్రకాశాత్మ చితిరూపా మహాంభజే॥

మనుః॥ ఓం భూర్భువస్సువః। తత్సవితుర్వరేణ్యం।
భర్గో దేవస్య ధీమహి। ధియో యో నః
ప్రచోదయాత్।
పరోరజసి సావదోమ్ ॥

ఈ విధముగ చతుష్పాద్గాయత్రి యను మంత్రము కలదు. కేవల గాయత్రీ ఛందస్సు త్రిపదాత్మకమగుటచే దీనిని చతుష్పాద్గాయత్రి యనిరి. పాదమున కెనిమిదక్షరము లుండుట ఇక్కడ కూడ చూడవచ్చును. ఇదియు వైదిక ఛందస్సే. ఈ గాయత్రికి ఋషిదేవతలు వేరు. విమలఋషి

యనియు, పరమాత్మ దేవతయు మొదలైనవి. అంగన్యాసము లును వేరుగా చెప్పబడినవి. ధ్యానగోచరమైన దేవతయు వేరే. ధ్యానశ్లోకములందు సచ్చిదానందరూపమైన నిర్విశేష పరబ్రహ్మమే ధ్యేయవస్తువుగా పేర్కొనబడినది. గాయత్రి యను నామసామ్యము తప్ప వేరెద్దియు సంబంధము లేదని తెలియుచున్నది. అయిన ఈ గాయత్రితో చేర్చుటకు కారణ మేమన - "పరోరజసి" యను పాదము కూడ నిర్వి శేషపరబ్రహ్మమునే బోధించుచున్నది. ఎట్లన :-

**పరోరజసేసావదోమ్ :-**

పరః-రజసి-సా-అవతు-ఓమ్ అని పదవిభాగము. అవతు అని పూర్తిగా లేక అవత్ అని మాత్రమే యుండుటయు, దానితో ఓమ్ చేరి "దోమ్" అగుటయు ఛాందసము. రజస్ శబ్దమునకు మూలప్రకృతి యని యర్థము. రజసః పరః = మూలప్రకృతి కంటె ముందుండునది పరోరజః, దానియందు పరోరజసి అనగా మూలప్రకృతి కంటె ముందుండిన సంవిత్ (జ్ఞాన) రూపమైన ఏ తేజస్సు కలదో లేక- మూల ప్రకృతికి పరుడుగానున్న పురుషునియందు జ్ఞానరూపముగా సర్వోపనిషత్ప్రతిపాదితమైన ఏ బ్రహ్మశక్తి కలదో అదియే అసంగచిద్రూపమైన ధ్రువకళ యనెడు ఏ త్రిపురసుందరీ కలదో సా = ఆమె, ఓమ్ = పరబ్రహ్మస్వరూపము, అవతు (నన్ను) రక్షించుగాక!

తా॥ శుద్ధ గాయత్రీ మంత్రార్థమే ఈపాదమునందును ప్రతిపాదింపబడినది. అయితే పై మూడు పాదములు తత్త్వమసి యను మహావాక్యార్థమును బోధించుచుండ ఈ నాల్గవ పాదము సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్తను వాక్యమును రూపాంతరమున అనువదించుచున్నది. రజస్సత్త్వతమో రూపమైన మూలప్రకృతికి పూర్వము సంవిద్రూపమైన ఏ తేజస్సు కలదో- ఏనిర్గుణ పరబ్రహ్మము నిండి నిబిడీకృతమై ఏకమాత్రముగ తేజరిల్లెనో అసంగచిద్రూపమైన ఆ పర బ్రహ్మము నన్ను కాపాడుగాక! అనగా అవిద్యా నివృత్తి పూర్వక స్వస్వరూపజ్ఞానము కలుగజేయుగాక!

# గాయత్రీ వ్యవహారము

"ఉష్ణిక్" మొదలగు ఛందస్సులలో గాయత్రీ ఛందస్సు గొప్పది. అందుకే శ్రీకృష్ణుడు "గాయత్రీ ఛందసామహమ్" ఛందస్సులలో నేను గాయత్రిని అని చెప్పెను. గాయత్రికి రెండు విధములైన ప్రాశస్త్యము కలదు. "న గాయత్ర్యాః పరోమన్త్రః" అను వచనమును బట్టి గాయత్రీ మంత్రమునకు మించిన మంత్రమే లేదు. జీవబ్రహ్మైక్యానుసంధానసాధనమైనందున దీనికి ప్రాశస్త్యము.

వేదములో గాయత్రీ ఛందస్సు గల మంత్రములు పెక్కు కలవు.

రుద్ర గాయత్రి :- తత్పురుషాయ విద్మహే
మహాదేవాయ ధీమహి
తన్నో రుద్రః ప్రచోదయాత్

దుర్గా గాయత్రి :- కాత్యాయనాయ విద్మహే
కన్యకుమారి ధీమహి
తన్నో దుర్గిః ప్రచోదయాత్

విష్ణు గాయత్రి :- నారాయణాయ విద్మహే
వాసుదేవాయ ధీమహి
తన్నో విష్ణుః ప్రచోదయాత్

లక్ష్మి గాయత్రి :- మహాలక్ష్మై చ విద్మహే
విష్ణుపత్న్యైచ ధీమహి
తన్నో లక్ష్మీః ప్రచోదయాత్

బ్రహ్మ గాయత్రి :- వేదాత్మనాయ విద్మహే
హిరణ్యగర్భాయ ధీమహి
తన్నో బ్రహ్మ ప్రచోదయాత్

నన్ది గాయత్రి :- తత్పురుషాయ విద్మహే
చక్రతుండాయ ధీమహి
తన్నో నన్దిః ప్రచోదయాత్

దన్తి గాయత్రి :- తత్పురుషాయ విద్మహే
వక్రతుండాయ ధీమహి
తన్నో దన్తిః ప్రచోదయాత్

షణ్ముఖ గాయత్రి :- తత్పురుషాయ విద్మహే
మహాసేనాయ ధీమహి
తన్నష్షణ్ముఖః ప్రచోదయాత్

ఈవిధముగ పెక్కు గాయత్రీ మంత్రములు కనబడు చున్నవి. ఇవి గాయత్రీ ఛందోనిబద్ధములై యున్నందున వీనికి ఆ యా గాయత్రీ నామములు తగియున్నవి. కేవల గాయత్రి యను పేరు "తత్స వితుర్" అను మంత్రమునకు మాత్రమే వర్తించును. ఏలయన ఆ మంత్రమునకు అధిష్ఠాన దేవత గాయత్రి, ఛందస్సుకూడ గాయత్రియే.

గాయత్రీ పదమునకు వ్యుత్పత్త్యర్థమేమన- గాయన్తం త్రాయతి ఇతి గాయత్రీ; గాయన్తం = ఉచ్చరించువానిని, త్రాయతి ఇతి=రక్షించునది గాన గాయత్రి యనబడును. వ్యుత్పత్తి దేవతకును ఛందస్సునకును వర్తించును. అచేతనమైన ఛందస్సు రక్షించుటెట్లందురా మంత్ర- దేవతా- ఛందస్సుల కభేదము భావింపవలెను. గాయత్రీ ఛందోనిబద్ధ వర్ణాత్మకమైన రుద్రదేవతను మదాత్మరూపముగ ధ్యానించు చున్నాను అని రుద్ర గాయత్రికిని, గాయత్రీఛందోనిబద్ధ వర్ణాత్మకమైన విష్ణుదేవతను మదాత్మరూపముగ ధ్యానించు చున్నానని విష్ణు గాయత్రికిని ఇట్లే ఆయా దేవతా ధ్యాన రూపములైన గాయత్రీ మంత్రముల కర్థమూహించుకొన వలెను. పై గాయత్రీ ఛందస్సులలో నొక్కొకయెడ వర్ణలోప వర్ణాధిక్యము లుండును. అన్నియు ఛాందసములైనందున సాధువులే యగును.

"అగ్రం వై ఛాందసాం గాయత్రీ" అను శ్రుతివలన ఛందస్సులలో గాయత్రిచందస్సు శ్రేష్ఠమైనది. పింగళాచార్యులు "ఉక్తాత్యుక్తా తథా మధ్యా" అని చెప్పినందున ఉక్త ఛందస్సు ఉత్తమమని యేల యనరాదు? వినుము. అన్ని వేదములలో మొదటిది ఋగ్వేదము. అందు మొదటి ఋక్కు "అగ్నిమీళే" యనునది. అది గాయత్రీ ఛందోనిబద్ధమగుటచే ఆ ఛందస్సు సర్వోత్తమమని గ్రహింపవలెను.

అగ్నిమీళే పురోహితం
యజ్ఞస్య దేవ మృత్విజం
హోతారం రత్న ధాతమమ్

ఇది పాదమున కెనిమిదేసి అక్షరములు గల గాయత్రి ఛందస్సు. వేదాదియందుండుటచే గాయత్రీ ఛందస్సు గొప్పదని యంటిరికదా! అగ్నిపదము మొట్టమొదటిదగుటచే దేవతలలో యగ్ని ఉత్తముడని చెప్పరాదా! యందురేమో!

"అగ్ని ర్వై దేవానా మవమో విష్ణుః పరమః"

అను మంత్రములో దేవతలలో అగ్ని తక్కువవాడనియు, విష్ణు డెక్కువవాడనియు చెప్పబడినది. కావున తొలి మంత్రమున నుండుటచేత గొప్పతనము రాదు. గాయత్రీ చందస్సు యొక్క శ్రేష్ఠతను తెల్పు మరియొక మంత్రము పై నుదాహరింపబడినది.

# మనుస్మృతిలో గాయత్రి

## 2 వ అధ్యాయము

అకారం చాప్యుకారంచ మకారంచ ప్రజాపతిః
వేదత్రయాన్నిరదుహత్ భూర్భువస్స్వరితీతిచ ।

ఓంకారావయవములైన అకార ఉకార మకారములను, భూః భువః (స్వః) సువః అను వ్యాహృతులను బ్రహ్మదేవుడు ఋగ్ యజుస్ సామవేదములనుండి వెలికితీసెను.

త్రిభ్య ఏవతు వేదేభ్యః పాదం పాదమదూదుహత్
తదిత్యృచోఽస్యాః సావిత్ర్యాః పరమేష్ఠీ ప్రజాపతిః ॥

పరమేష్ఠియైన బ్రహ్మదేవుడు గాయత్రీ (సావిత్రీ) మంత్రము యొక్క మూడు పాదములను మూడు వేదములనుండి వెలువరించెను.

ఏతదక్షర మేతాం చ జపన్ వ్యాహృతి పూర్వికామ్
సంధ్యయోర్వేదవిద్విప్రో వేద పుణ్యేన యుజ్యతే ॥

ఓంకారమును వ్యాహృతి త్రయమును గూడిన యీ గాయత్రిని ప్రాతస్సాయం సంధ్యలయందు జపించు వేదవేత్తలైన ద్విజులు వేదత్రయ పారాయణ పుణ్యమును పొందుదురు. కావున సంధ్యాకాలమున ప్రణవ-వ్యాహృతి త్రయముతో గూడిన సావిత్రిని జపింపవలెనని విధి యేర్పడుచున్నది.

సహస్రకృత్వస్త్వభ్యస్య బహిరేతత్త్రికం ద్విజః
మహతోఽప్యేనసో మాసాత్ త్వచేవాహిర్విముచ్యతే॥

ఈ గాయత్రిని సంధ్యాకాలముననే గాక వేరుసమయమున ఊరి వెలుపల నున్న నదీతీర వనాది పవిత్ర స్థలములలో ఒక నెల దినములు ప్రతిదినము సహస్ర పర్యాయములు జపించిన యెడల కుబుసమునుండి సర్పము వెలికి వచ్చినటుల ఎంత గొప్ప పాపమునుండి యైనను ద్విజుడు విముక్తుండగును.

ఏతయర్చా విసంయుక్తః కాలేచ క్రియయా స్వయా
బ్రహ్మక్షత్రియవిడ్యోనిః గర్హణాం యాతి సాధుషు॥

ఈ గాయత్రిని సంధ్యాకాలమున జపింపక సాయంప్రాత ర్హోమాదులు చేసెడి బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులు సత్పురుషులలో నిందకు పాత్రులగుదురు. కావున గాయత్రి జపమును తన యితర వైదికానుష్ఠానమును నియత కాలమున చేయవలెను.

ఓంకారపూర్వికా స్తిస్రో మహావ్యాహృతయోఽవ్యయాః
త్రిపదా చైవ గాయత్రీ విజ్ఞేయం బ్రహ్మణో ముఖమ్।

ఓం భూర్భువస్సువః అనెడి ఓంకార పూర్వకములైన మూడు మహా వ్యాహృతులును, తత్సవితుర్వరేణ్యం అను మూడు

పాదములు గల గాయత్రియు వేదాధ్యయన ప్రారంభమున నుండునది గాన వేదము యొక్క ముఖముగ గుర్తింపవలెను. లేదా - బ్రహ్మ ప్రాప్తి సాధనములు. అధ్యయన జపాదులచే పాపము నశించి బ్రహ్మజ్ఞాన ముదయించును. అది మోక్ష హేతువగుచున్నది.

యోఽధీతేఽహన్యహన్యేతాం త్రీణి వర్షాణ్యతంద్రితః
స బ్రహ్మ పరమభ్యేతి వాయు భూతఃఖమూర్తిమాన్ ॥

ఎవడు దీనిని దీక్షతో మూడు సంవత్సరములు ప్రతి దినము ప్రత్యేకోపాసన చేయునో అతడు బ్రహ్మకభిముఖముగా వెళ్ళును. మరియు వాయు స్వరూపుడై వాయువువలె కామచారి యగును. ఆకాశశరీరుడగును. అనగా శరీర రహితుడై బ్రహ్మస్వరూపుడగును.

ఏకాక్షరం పరంబ్రహ్మ ప్రాణాయామాః పరంతపః
సావిత్ర్యాస్తు పరంనాస్తి మౌనాత్సత్యం విశిష్యతే॥

పరబ్రహ్మప్రాప్తి సాధనము గాన ఓంకారము పరబ్రహ్మము ఓంకార జపము తదర్థ భావనయు చేయవలెను. సప్రణవ వ్యాహృతులతో శిరస్సుతో కూడిన గాయత్రీ మంత్రమును కుంభకములో ముమ్మారు జపించెడి ప్రాణాయామములు కృచ్ఛ్రచాంద్రాయణాదులకు మించిన తపస్సు. ప్రాణాయామములు అను బహువచనము వలన ప్రతి పర్యాయము

ప్రాణాయామము మూన్మూర్లు చేయవలెనని యర్థము. గాయత్రికి మించిన మంత్రము లేదు. మౌనము కంటె సత్య భాషణము గొప్పది. ఈ శ్లోకమున ప్రణవము-ప్రాణాయామము-గాయత్రి-సత్యము అను నాల్గింటిని ప్రశంసించుట వలన ఈ నాల్గును ఉపాసింప వలసినవి యను నొక విధి లభించుచున్నది.

2 అధ్యా. 76-83 శ్లో॥

# సామవేదీయ
# ఛాందోగ్యము - గాయత్రి
## తృతీయాధ్యాయము ద్వాదశ ఖండము

అవ॥ సామవేదమునకు చెందిన ఛాందోగ్యోపనిషత్తు యొక్క తృతీయాధ్యాయములోని ద్వాదశ ఖండములో గాయత్రీ మంత్రము ద్వారా బ్రహ్మోపాసన బోధింపబడినది. అయితే ఈ పరబ్రహ్మోపాసనకు సాధనమైన గాయత్రి చతుష్పదయని 5 వ మంత్రమున "సైషా చతుష్పదా" అని చెప్పబడినది. సంధ్యావందనములోని గాయత్రి త్రిపద కాగా ఇది చతుష్పద యని భావము. త్రిపద గాయత్రి వటుక గృహస్థుల కుపాస్యము కాగా చతుర్థ పాదముతో కూడిన గాయత్రి యతీశ్వరులకు బ్రహ్మోపాసనా ప్రతీకమగు చున్నది. త్రిపద షట్కుక్షి కాగా చతుష్పద షడ్విధయైనది. తద్వివరణము 5 వ మంత్రమున రాగలదు. గాయత్రి, త్రిపద, చతుష్పద ఈ పదములన్నియు పరబ్రహ్మ పరములే యని ఆ యా ఘట్టములలో వివరింపబడును.

1. మం॥ గాయత్రీ వా ఇదగ్ం సర్వం భూతం యదిదం కించ
వాగ్వై గాయత్రీ, వాగ్వా ఇదగ్ం సర్వం భూతం
గాయతి చ త్రాయతే చ॥

అ॥ యత్ కించ ఇదగ్ం = ఏయే నామ రూపములతో మనకు గోచరించెడి యీ, భూతం సర్వం = పదారజాతమంతయు, గాయత్రీవై = గాయత్రీ స్వరూపమై యున్నది. వాగ్ వై గాయత్రీ = శబ్ద బ్రహ్మ రూపమే గాయత్రి, ఇదగ్ం సర్వం భూతం = ఈ కనబడు సర్వ ప్రపంచమును, వాక్వై = వాక్కే, గాయతి చ = వేర్వేరు నామములతో వ్యవహరించు చున్నది. త్రయతే చ = రక్షించుచును ఉన్నది. (గాన-త్రాణములు కలసి గయత్రి యైనది)

తా॥ జడ చేతన రూపమై అనేక నామములతో వివిధ రూపములతో మనకు కనబడు ఈ భూత భౌతిక ప్రపంచ మంతయు గాయత్రీ రూపమే. సృష్ట్యాదిలో వెలువడిన ప్రణవాత్మకమైన నాదము గాయత్రియే. అదియే వివిధ నామములుగా విస్తరించినది. నామముల వెంటనే రూపము లేర్పడినవి. నామ రూప వ్యవహారమునకే గానమని పేరు. త్రా = రక్షించుట, నామ రూపాత్మకమైన జగత్తును వ్యవహరించునది రక్షించునదియు గాన ఆ దేవత గాయత్రి యైనది. పూర్వము గానము చేయు వానిని (జపించువానిని) రక్షించునది గాన గాయత్రి యని చెప్పబడెను. ఈ వివరణము పరబ్రహ్మము నకే వర్తించును.

2. మం॥ యా వై సా గాయత్రీ ఇయం వావ సా యేయం పృథివ్య
స్యాగ్ం హీదగ్ం సర్వం భూతం ప్రతిష్ఠిత
మేతామేవ నాతిశీయతే॥ ౨

అవ॥ పూర్వమంత్రము గాయత్రీ బోధిత పరబ్రహ్మము సర్వాత్మకమని చెప్పి యిపుడు వ్యష్టిలో పృథివీ రూపముగ తెల్పుచున్నాడు.

అ॥ యా వై = ఏదైతే వాక్ స్వరూపముగ చెప్పబడెనో, సా గాయత్రీ = ఆ గాయత్రి, ఇయం వావ = భూతాశ్రయమై ప్రసిద్ధమైన యీ పృథివియై యున్నది, యా ఇయం పృథివి = ఏ ఈ ప్రత్యక్షమైన భూమికలదో, అస్యాం = దీనియందు, ఇదం సర్వం భూతం = ఈ స్థావర జంగ మాత్మకమగు భూత సముదాయము, ప్రతిష్ఠితం = అధిష్ఠించియున్నది. ఏతాం = ఈ పృథివీ స్వరూపమును, న అతిశేతే = అతిక్రమించుటలేదు.

తా॥ వాగ్రూపముగ సమస్త నామములతో సమస్త వస్తు రూపముగ విస్తరించిన యీగాయత్రీ బోధిత బ్రహ్మమే పృథివీ స్వరూపము కూడ అయి యున్నది. పృథివి యెట్లు భూతాశ్రయమో గాయత్రియు అటుల భూతాశ్రయము గాన పృథివీ రూపత్వము చెప్పబడినది. గాయత్రిలో త్రాణము అనగా రక్షణము అను విశేషము కలదు. పృథివి యందు ప్రతిష్ఠితములైన భూతములు పృథివిని అతిక్రమింప నటుల సర్వ భూతాశ్రయమైన గాయత్రిని సర్వ భూతము

లతిక్రమింపవు. ఇది బ్రహ్మ సామ్యము. కాన గాయత్రీ రూపమున బ్రహ్మోపాసన చేయవలెనని భావము.

3. మం॥ యావై సా పృథివీ ఇయం వావ సా యదిద
మస్మిన్ పురుషే శరీర
మస్మిన్ హీమే ప్రాణాః ప్రతిష్ఠితా ఏతదేవ
నాతిశీయన్తే॥

అవ॥ గాయత్రి యందు శరీర స్వరూపము - తద్ద్వారా ప్రాణాశ్రయత్వము నిరూపింపబడుచున్నది.

అ॥ యావై పృథివీ = ఏ విశ్వంభరా రూపము కలదో, సా ఇయం వావ = అది యీ గాయత్రియే, సా = ఆ పృథివీ స్వరూపము, అస్మిన్ పురుషే = ఈ స్థూల రూపమైన పురుషుని యందు, యత్ శరీరం = ఏ శరీరము కలదో, అస్మిన్ = దీనియందు, ఇమే ప్రాణాః = ఈ ప్రాణములు, ప్రతిష్ఠితాః = ఆశ్రయించి యున్నవి, హి = అందువలన. ఏతత్ ఏవ న అతిశీయన్తే = దీనిని అతిక్రమింపవు.

తా॥ బ్రహ్మబోధకమైన గాయత్రీ స్వరూపముగా భావింపబడిన ఏ పృథివీ స్వరూపము కలదో అదియే పురుషుని శరీర నిర్మాణమునకు మూలమైయున్నది. కావున భూతములలో చేరిన ప్రాణములు శరీరమందు వర్తించుచు దాని నతిక్రమింపజాలవు.

4. మం॥ యద్వై తత్పురుషే శరీరమిదం వావ
తద్యదిద మస్మిన్నంతః పురుషే
హృదయ మస్మిన్ హీమే ప్రాణాః ప్రతిష్ఠితా
ఏతదేవ నాతిశీయన్తే॥

అవ॥ గాయత్రి హృదయ రూపముగ భావింపబడుచున్నది.

అ॥ తత్ పురుషే = గాయత్రి రూపముగ ప్రసిద్ధుడైన ఆ పురుషుని యందు (బ్రహ్మమునందు) యత్ శరీరం = ఏ శరీరము కలదో, తత్ = అది, ఇదం వావ = ఈ హృదయ కమలమై యున్నది, అస్మిన్ అంతః పురుషే = ఈ పురుష శరీరము లోపల, యత్ హృదయం = హృదయమను పేరుగల కమలాకార మాంసపిండము ఏది కలదో, అస్మిన్ =దీనియందు, ప్రాణాః = ప్రాణాది వృత్తులు, ప్రతిష్ఠితాః = ఆశ్రయించి యున్నవి, హి = అందువలన, ఏతత్ = ఈ హృదయ కమలమును, న అతి శీయంతే ఏవ = అతిక్రమింప జాలవు.

తా॥ పూర్వ మంత్రమున గాయత్రీ రూపముగ భావింపబడిన పురుష శరీర సారమే దేహ మధ్యమున కమలాకార మాంస పిండముగ వర్ణింపబడు హృదయమై యున్నది. "పద్మకోశ ప్రతీకాశం హృదయం చాప్యధోముఖం" అని శ్రుతిలో వర్ణింపబడినది ఇదియే. ఈ హృదయమునందే భూతవాసనామయమైన ప్రాణాది వృత్తులు ప్రతిష్ఠితములై యున్నవి. కావున ప్రాణాదివృత్తులు హృదయమును అతిక్రమింపక వర్తించును.

5. మం॥ సైషా చతుష్పదా షడ్విధా గాయత్రీ తదేత
దృచాభ్యనూక్తమ్॥

అవ॥ గాయత్రీ స్వరూపమైన పరబ్రహ్మోపాసనను ఉపసంహరించుచున్నాడు.

అ॥ సా = సర్వభూతాత్మకమై సర్వాశ్రయమైన, ఏషా గాయత్రీ = ఈ పరబ్రహ్మోపాసనా విషయముగ ప్రబోధింపబడిన గాయత్రీ స్వరూపము, చతుష్పదా = నాల్గు పాదములు కలది, షడ్విధా = వాక్కు, భూతములు, పృథివి, శరీరము, హృదయము, ప్రాణములు అనెడి ఆరు విధములైనది, తత్ ఏతత్ = ఆ విధముగ ప్రసిద్ధమైన యీ గాయత్రీ రూప పరబ్రహ్మోపాసనము, ఋచా = ఋఙ్మంత్రము చేత, అనూక్తమ్ = అనువాద రూపముగా చెప్పబడినది.

తా॥ పై దెల్పిన ఋక్కులలో పరబ్రహ్మోపాసనా విషయముగ నిరూపింపబడిన యీ గాయత్రీ స్వరూపము నాల్గు పాదములతోను, వాగ్భూత పృథివీ శరీర హృదయ ప్రాణములనెడు ఆరు రూపములతోను వెలయుచున్నది. సర్వాధారమగుటచేత ఇది బ్రహ్మ స్వరూప సామ్యము కలిగియున్నది. అట్టి యీ గాయత్రిని ప్రతీకగా స్వీకరించి పరబ్రహ్మోపాసన చేయవలెను. ఇచట గాయత్రి పదము ప్రధానముగ పరబ్రహ్మ బోధకమే. ఐతే అష్టవర్ణాత్మక పాదనియమము గల వైదిక ఛందస్సునకు గాయత్రి యను నామధేయ ముండుటవలన కాకతాళీయముగ గాయత్రీ ఛందస్సు అన్వయించినది. పై దెల్పిన వాగ్భూత పృథివీ శరీర హృదయ ప్రాణాత్మకత్వము పరబ్రహ్మమున కన్వయించునే కాని వర్ణాత్మక గాయత్రీ ఛందస్సునకు వర్తించదు. కావున గాయత్రీ ఛందస్సు నవలంబించి తద్బోధితమైన

బ్రహ్మమునందు మనసు నిలిపి ఉపాసించవలెనని గ్రహించవలెను. పై దెల్పిన నాలుగు పాదములు బ్రహ్మమునకు వర్తించుట "పాదోఽస్య విశ్వాభూతాని, త్రిపాదస్యామృతం దివి" అను శ్రుతిచే తెలుపబడినది. ఇక్కడ ఛందస్సునకు వర్తించుట కాకతాళీయము.

# శుక్ల యజుర్వేదీయ బృహదారణ్యకము - గాయత్రి

## సప్తమాధ్యాయము - చతుర్ధశ బ్రాహ్మణము

ఈ బ్రాహ్మణమున 8 మంత్రములలో గాయత్రి ప్రస్తావన కలదు. వేదములతో సహా బ్రహ్మాండమంతయు గాయత్రీ స్వరూపముగ దర్శించి గాయత్రి యను ఉపాధి ద్వారా బ్రహ్మోపాసనము విధింపబడినది. ఎనిమిదక్షరములు గల గాయత్రి యొక్క మూడు పాదములను వేర్వేరు దృష్టితో ఉపాసన చేయుట, వానికి వేర్వేరు ఫలములుకూడ నిర్దేశింప బడినవి. ఉపాస్యములగు వస్తువులు కూడ గాయత్రీ ఛందస్సునందే నిబంధింపబడినవి. పరోరజసి అనునది మాట వరుసకు నాల్గవ పాదముగ పేర్కొన బడెనే కాని గాయత్రి యొక్క త్రిపదత్వమునకు భంగము కలుగలేదు. ఆ పాదము

తెలియబడునది కాదనియు పై మూడు పాదముల యర్థమును దానియందుపసంహరింప నలెననియు బోధింపబడినది. ఈ గాయత్రీ మహిమను (శ్రీ) జనక మహర్షి బుడిలునకు బోధించెనని విశదీకరింపబడినది.

## ఇక వివరణము

1. మం॥ భూమిరన్తరిక్షం ద్యౌరిత్యష్టా వక్షరాణ్యష్టాక్షరగ్ం హ వా
ఏకం గాయత్ర్యై పదమేత దుహైవాస్యా ఏతత్స యావ
దేషు త్రిషు లోకేషు తావద్ధ జయతి యోఽస్యా ఏతదేవం పదం వేద॥

అ॥ భూమిః అన్తరిక్షం ద్యౌః (ద్యౌః పదమును ణియం వలె ద్యౌః అని రెండక్షరములుగ లెక్కింపవలెను) గాయత్ర్యై = గాయత్రి యొక్క (చతుర్థీ విభక్తికి షష్ఠ్యర్థము) అష్టాక్షరం = ఎనిమిదక్షరములు గల, ఏకం = ఒక్క. పదం = పాదము, ఏతత్ – ఉ – హ – ఏవ = భూమి అంతరిక్షము స్వర్గము అను ఈ త్రిలోకములే, అస్యాః = ఈ గాయత్రి యొక్క, ఏతత్ – పదం = ఈ ఎనిమిదక్షరములు గల పాదమును ఏవం = ఈ విధముగ, యః వేద = ఎవడు తెలిసికొనునో, సః = వాడు, ఏషు త్రిలోకేషు = ఈ ముల్లోకములందు, యావత్ = ఎంత కావలయునో, తావత్ హ జయతి = అంత జయించుచున్నాడు.

తా॥ తత్సవితుర్వరేణ్యం అను మొదటి పాదమును భూమ్యంతరిక్ష ద్యులోకములుగ గుర్తించినవాడు ఈ త్రిలోకములలో దేనిని జయింపగోరునో దానిని జయింపగలడు.

2. మం॥ ఋచో యజూగ్ంషి సామానీ త్యష్టావక్షరాణ్యష్టాక్షరగ్ం హవా ఏకం గాయత్ర్యై పదమేతదు హైవాస్యా ఏతత్స యావతీయం త్రయీ విద్యా తావద్ధ జయతి యోఽస్యా ఏత దేవం పదం వేద.

అ॥ "ఋచః యజూంషి సామాని" ఇతి అష్టౌ అక్షరాణి = ఋచః యజూంషి సామాని అని యెనిమిదక్షరములు, గాయత్ర్యై = గాయత్రి యొక్క. అష్టాక్షరం హవై = ఎనిమిదక్షరములు గల, ఏకం పదం = ఒక్క పాదమనగా రెండవ పాదము, ఏతత్ - ఉ-హ - ఏవ = ఈ వేదత్రయమే, అస్యాః = ఈ గాయత్రి యొక్క, ఏతత్ = ఈ రెండవ పాదము, ఏవం = ఈ విధముగ, అస్యాః = ఈ గాయత్రి యొక్క, ఏతత్ = ఈ రెండవ పాదమును, యః వేద = ఎవడు తెలిసికొనునో, సః = అతడు, ఇయం త్రయీ విద్యా = ఋగ్యజుస్సామాత్మకమైన యీ వేదవిద్య, యావతీ = ఎంతటి ఫలదాయకమో, తావత్ హ = అంతటి ఫలమును, జయతి = జయించు (పొందు) చున్నాడు.

తా॥ ఋచః యజూంషి సామాని అనెడి ఈ యెనిమిదక్షరములు గాయత్రి యొక్క రెండవ పాదముగ భావింపవలెను. వేదత్రయమే గాయత్రి యొక్క రెండవ పాదమని

ధ్యానించినవాడు వేదత్రయాధ్యయనము చేసినవాని ఫలమును పొందును.

3. మం॥ ప్రాణోఽపానో వ్యాన ఇత్యష్టా వక్షరాణ్యష్టాక్షరగ్ం హ్యేకం గాయత్ర్యై పద మేతదు హైవాస్యా ఏతత్స యావదిదం ప్రాణి తావద్ధ జయతి యోఽస్యా ఏత దేవం పదం వేదా థా స్యా ఏత దేవ తురీయం దర్శతం పదం పరోరజా య ఏష తపతి యద్వై చతుర్థం తత్ తురీయం దర్శతం పద మితి దదృశ ఇవ హ్యేష పరోరజా ఇతి సర్వము హ్యేవైష రజ ఉపర్యుపరి తపత్యేవగ్ం హైవ శ్రియా యశసా తపతి యోఽస్యా ఏత దేవం పదం వేద.

తా॥ ప్రాణ అపాన వి ఆన (వ్యాన) అను ఎనిమి దక్షరములు గాయత్రి యొక్క మూడవ పాదమని ఉపాసింప వలెను. ఇటుల భావించి ఉపాసించువాడు లోకములోని ప్రాణి సమూహమును జయించుచున్నాడు. అనగా తన వశమునందుంచుకొనును. ఈ విధముగ గాయత్రి యొక్క మూడు పాదములను గుర్తించిన పిమ్మట ప్రత్యక్షముగ కనబడు సూర్యమండలములో నున్న హిరణ్మయ పురుషుని ఈ గాయత్రి యొక్క పరోరజ యనెడు చతుర్థ పాద రూపు

నిగ ఉపాసింపవలెను. దానిచే సూర్యునివలె సర్వాధిపత్యము వహించి విశ్వవిఖ్యాతుడగును.

విశే: "పరోరజసి సావదోమ్" అను మంత్రమునకు ఎనిమిదక్షరము లుండుటచే గాయత్రి యొక్క నాల్గవ పాదమని పేరు వచ్చినది. కాని అది గాయత్రిలోనిది కాదు. గాయత్రికి ఎనిమిదక్షరములు గల మూడు పాదములు మాత్రమే యుండవలెను. గాయత్రిలో చేరినచో ఉపనయనమున ఉపదేశము కావలెను. అది లేదు. కాని బ్రహ్మయజ్ఞములో గాయత్రితో చేర్చి ఒకసారి ఉచ్చరించు నాచారమేర్పడినది. జపములేదు. ఇది యథర్వణ వేదములోనిది. ఈ విషయము పూర్వము తెలుపబడినది.

4. మం॥ సైషా గాయత్ర్యేతస్మిగ్ం స్తురీయే దర్శతే పదే పరోరజసి ప్రతిష్ఠితా తద్వై తత్సత్యే ప్రతిష్ఠితం చక్షుర్వై సత్యం చక్షుర్హివై సత్యం తస్మాద్యది దానీం ద్వౌ వివదమానా వేయాతా మహామదర్శ మహామశ్రౌషమితి య ఏవ బ్రూయా దహమదర్శమితి తస్మా ఏవ శ్రద్ధధ్యామ తద్వై తత్సత్యం బలే ప్రతిష్ఠితం ప్రాణో వై బలం తత్ప్రాణే ప్రతిష్ఠితం తస్మా దాహుర్బలగ్ం సత్యా దోగీయ ఇత్యేవ మేషా గాయత్ర్యధ్యాత్మం ప్రాణే ప్రతిష్ఠితా సాహైషా గయాగ్ం స్తత్రే ప్రాణావై

గయా స్త్రత్ప్రాణాగ్ం స్తత్రే తద్యద్గయాగ్ం
స్త్రతే౽స్మాద్గాయత్రీ నామ సయామేవాముాగ్ం
సావిత్రీ మన్వాహైషైవ స యస్మా అన్వాహ
తస్య ప్రాణాగ్ం స్త్రాయతే॥

అవ॥ గాయత్రీ పదమునకు వేరొక వ్యుత్పత్తియు, తదుపాసన కుప సంహారమును చెప్పబడుచున్నది.

ఆ॥ సా ఏషా గాయత్రీ = పై దెలుపబడిన యీ గాయత్రి, పరో రజసి = పరోరజసి యను, దర్శతే పదే = కనబడు నట్లుండు సూర్య మండలాంతర్గత పురుషుని స్థానము గల, తురీయే = నాల్గవ పాదమునందు, ప్రతిష్ఠితా = ఉంచబడి యున్నది. తద్వైతత్ = ప్రసిద్ధమైన ఆ సూర్యాత్మకమగు నాల్గవ పాదము, సత్యే ప్రతిష్ఠితం = సత్యము నందు ప్రతిష్ఠింపబడినది, చక్షుర్వై సత్యం = నేత్రమే సత్యము చక్షుర్హి సత్యావై = నేత్రమే సత్యమని ప్రసిద్ధి చెందినది.

ఎట్లన : ఇదానీం = ఇప్పుడు, అహం అదర్శం = నేను చూచితిని, అహం అశ్రౌషం = నేను వింటిని, ఇతి వివదమానే = అని కలహించుచూ, ఏయాతాం = వచ్చిరి (అనుకొనుడు - వారిలో) అహం అదర్శం ఇతి = నేను చూచితినని, య ఏవ బ్రూయాత్ = ఎవడు చెప్పునో, తస్మై ఏవ = అతనిని గూర్చియే, శ్రద్ధధ్యామ = విశ్వసింతుము, తద్వై తత్సత్యం = అటువంటి సత్యము, బలే ప్రతిష్ఠితమ్ = బలమునందు ప్రతిష్ఠింపబడినది, ప్రాణోవై బలమ్ = ప్రాణమే బలము, తస్మాత్ = అందువలన, బలం = ప్రాణము, సత్యాత్ = సత్యముకంటె, ఓగీయ ఇతి = శ్రేష్ఠమని, ఆహుః = చెప్పుదురు. ఏవం ఏషా గాయత్రీ = ఇట్లే గాయత్రి, అధ్యాత్మం = అధ్యాత్మ

స్వరూపమైన, ప్రాణే ప్రతిష్ఠితా = ప్రాణమునందు ఉంచబడినది. సా ఏషా హ = అట్టి యీ గాయత్రియే, గయాన్ = ఇంద్రియములను, తత్రే = రక్షించెను, ప్రాణాః వా గయాః = వాక్కు మొదలైన ప్రాణములే గయలు, తత్ ప్రాణాన్ = ఆ ప్రాణములను, తత్రే = రక్షించెను. తత్ యత్ = అది యేకారణమున, గయాన్ = వాగాదీంద్రియములను, తత్రే = రక్షించెనో, తస్మాత్ = ఆ కారణము వలన, గాయత్రీ నామ = గాయత్రి యను పేరు (వచ్చినది) సః = ఆ ఆచార్యుడు, యాం ఏవ అమూం సావిత్రీం = ఏ యీ సావిత్రిని, యస్మై అన్వాహ = ఏ అష్టవర్షోపనీత వటువునకు ఉపదేశించునో తస్య = ఆ వటువు యొక్క, ప్రాణాన్ = ప్రాణములను, త్రాయతే = రక్షించుచున్నది.

తా॥ భూర్భువస్సువర్లోకములు, ఋగ్యజుస్సామవేదములు, ప్రాణాపాన వ్యానములు ఇవి యెనిమిదేసి అక్షరములు గల మూడు పాదములు. ఇవి గాయత్రీ ఛందస్సు కలిగి యున్నవి. ఈ మూడును అనగా భూర్భువస్సువర్లోకములు, ఋగ్యజుస్సామములు, ప్రాణాపాన వ్యానములు. గాయత్రీ మంత్రము యొక్క మూడు పాదములుగా ఉపాసింపవలెను. ఉపాసకునకు వేర్వేరు ఫలములు పూర్వ మంత్రములలో తెలుపబడినవి. ఈ గాయత్రిని పరోరజసి అను మంత్రమునకు అన్వయించు సూర్య మండలాంతర్గత పురుషుని యందు లీనమగునట్లు భావింపవలెను. అది సత్యమునందు ప్రతిష్ఠింపబడినది. సత్యము నేత్రము నందుంచబడినది. ఎట్లనః- ఒకడు ఆ వస్తువును నేను ఈవిధముగ చూచితినను.

మరియొకడు నేను ఈ విధముగ వింటిననును. వారిద్దరు వాదులాడు చుందురు. అప్పుడు మధ్యవర్తి చూచినవాని పక్షమే బలపరచును. కావున సత్యము నిన్న. ఆ సత్యము బలరూపమైన ప్రాణమునందు నిలిచియున్నది. కావున ప్రాణము నేత్రముకన్న బలిష్ఠమైన దందురు. తుదకు పర మాత్మ స్వరూపమైన యీ ప్రాణమునందు మూడు పాద ములు గల గాయత్రి ప్రతిష్ఠింపబడినది. ఈ గాయత్రి వాగా దీంద్రియములను రక్షించుచున్నది. గయాన్ = ఇంద్రియ ములను, తత్రే = రక్షించెను గాన గాయత్రియను పేరు వచ్చినది. లోకమునందు 8 సం॥ల బాలునకు ఉపనయనము చేసి ఆచార్యుడు గాయత్రిని ఉపదేశించును. ఇది సవితృ (సూర్య) దేవతాకమైనందున సావిత్రి యనబడును. ఈ దేవత వటువు యొక్క ప్రాణములను కాపాడు చున్నది.

5. మం॥ తాగం హైతామేత్ సావిత్రీ మనుష్టుభ మన్వా
హురార్వాగనుష్టు బేతద్వాచ మనుబ్రూమ ఇతి న
తథా కుర్యాద్గాయత్రీమేవ సావిత్రీ మనుబ్రూయా
ద్యదిహ వా అప్యేవం వి ద్బహ్వివ ప్రతి గృహ్ణాతి
నహైవ తద్గాయత్ర్యా ఏక ఇచ్చ న పదమ్ప్రతి.

అవ :- మతాంతరమును ప్రస్తావించి నిరాకరించుచున్నది.

అ॥ తాం ఏతాం = అటువంటి యీ సావిత్రిని, ఏకే = కొందఱు, అనుష్టుభం = అనుష్టుప్ ఛందస్సని, అను + ఆహుః = అన్వాహుః

= చెప్పుదురు. ఏలయన, వాక్ అనుష్టుప్ = ప్రతివాక్కు అనుష్టుప్ అని, కావున, ఏతద్వాచం = ఈ వాక్కును, అనుబ్రూమః ఇతి = అను సరించి అనుష్టుప్పని చెప్పుచున్నాము. తథా = ఆ విధముగ, నకుర్యాత్ = గ్రహింపరాదు. గాయత్రీం ఏవ = గాయత్రినే, సావిత్రీం అను బ్రూయాత్ = సావిత్రి యని చెప్పవలెను. ఏవం విత్ = ఈ విధముగ తెలిసినవాడు, బహు ఇవ ప్రతి గృహ్ణాతి = అనేక వస్తువులను ఏ దానము పొందునో, తత్ = ఆ ప్రతి గ్రహము. ఏకం చ న పదం ప్రతి = ఒక్క పాదమును గూర్చియైనను, న హ ఏవ = సమర్థము కాదు.

తా॥ కొందరు గాయత్రి అనుష్టుప్ ఛందస్సు నుండి జనించినదని చెప్పుదురు. వారి మతమున ప్రతివాక్కు అనుష్టుబాత్మకమే. అది సరికాదు. పూర్వ మంత్రములో గాయత్రి ప్రాణ రూపమని చెప్పబడినది. వాగాది సర్వేం ద్రియములు ప్రాణముపై నాధారపడి యున్నందున గాయత్రి ఉపదేశము వలన బాలునకు సర్వ విధ చైతన్య స్ఫూర్తి లభించును. మానవునకు దానము పట్టుటచే సంక్రమించు సకల దోషములను గాయత్రి నివారణ చేయును. గాయత్రి యొక్క ఒక్క పాదమును ఉపాసన చేయుటచే కలిగిన ఫలి తమే యెక్కువ.

6. మం॥ స య ఇమాగ్ం స్త్రీ్ న్లోకా న్పూర్ణాన్ప్రతి గృహ్ణీ యాత్ సోఽస్యా ఏతత్ప్రథమం పదమాప్ను యా దథ యావతీయం త్రయీ విద్యా యస్తా వత్ప్రతి గృహ్ణీయాత్ సోఽస్యా ఏతద్ద్వితీయం పద

మాప్నుయా దథ యావ దిదం ప్రాణి యస్తావ
త్ప్రతి గృహ్ణీయాత్ సోఽస్యా ఏతత్తృతీయం పద
మాప్నుయా దథాఽస్యా ఏతదేవ తురీయం దర్శతం
పదం పరో రజా య ఏష తపతి నైవ కేనచ నాప్యం
కుత ఉ ఏతావత్ ప్రతి గృహ్ణీయాత్ ।

అవ॥ గాయత్రి యొక్క మూడు పాదముల ఫలములు విడివిడిగా తెలుపబడుచున్నవి.

అ॥ సః = ఆ గాయత్రీ తత్త్వవేత్త, యః = ఎవడైతే, ఇమాన్ త్రీన్ లోకాన్ = ఈ మూడు లోకములను, ప్రతి గృహ్ణీయాత్ = తన వశమున నుంచుకొనునో, సః = అతడు, అస్యాః = ఈ గాయత్రి యొక్క, ప్రథమం పదం అప్నుయాత్ = మొదటి పాదమును పొందును. అథ = పిమ్మట, ఇయం త్రయీ విద్యా = ఈ వేదరాశి, యావతీ = ఎంతటిదో, తావత్ = దానినంతయు, యః ప్రతి గృహ్ణీయాత్ = ఎవడు అధీనమునందుంచుకొనునో, సః = అతడు, అస్యాః = ఈ గాయత్రి యొక్క, ఏతత్ ద్వితీయం పదం = ఈ రెండవ పాదమును, ఆప్నుయాత్ = పొందును, అథ = తరువాత, ఇదం ప్రాణి = ఈ ప్రాణి సమూహము, యావత్ = ఎంతటిదో, తావత్ = దానినంతయు, యః ప్రతి గృహ్ణీయాత్ = ఎవడు అధీనము నందుంచుకొనునో, సః = అతడు, అస్యాః = ఈ గాయత్రి యొక్క, ఏతత్ తృతీయం పదం = ఈ మూడవ పాదమును, ఆప్నుయాత్ = పొందును. అథ = అనంతరము, య ఏష తపతి = ఏ ఈ సూర్యుడు ప్రకాశించుచున్నాడో, ఏతత్ ఏవ = ఇదియే, అస్యాః = ఈ గాయత్రి యొక్క పరోరజాః = పరోరజాయనెడు, తురీయం = నాల్గవదియైన, దర్శతం పదం = చూడబడినట్లున్న పాదము, కేనచిత్ = ఎవ్వనిచేతను, నైవ ఆప్యం = పొంద

బడునది కాదు. ఏతావత్ = ఇంత ఫలము, కుత ః ప్రతిగృహ్ణీయాత్ = దేనివలన లభించును ? దాత దేనందున ప్రతి గ్రహపదమునకు వశమందుంచుకొను అని వ్రాయబడినది)

తా॥ గాయత్రిని తెలిసికొనిన వానికి ప్రతి గ్రహ దోషము లేదని సామాన్యముగా చెప్పబడినది. అదియే ఇప్పుడు విశేషముగ చెప్పబడు చున్నది. ఈ మూడు లోక ములను ప్రతిగ్రహించిన వాని దోషము గాయత్రీ ప్రథమ పాద విజ్ఞానముచే నివారింపబడు చున్నది. ద్వితీయ పాద విజ్ఞానముచే ఋగ్యజుస్సామ వేద విజ్ఞాన ఫలము, తృతీయ పాద విజ్ఞానము వలన సమస్త ప్రాణి జాతము తన వశము నందుంచుకొను సామర్థ్యము కలుగును. సూర్య మండలాంత ర్గత పురుష స్వరూపమగు "పరోరజసి" అను నాల్గవ పాద ముపాసించుట కష్ట సాధ్యము. ఇటుల గుర్తించి గాయత్రి నుపాసించువాడు సమస్త దోషములకు దూరముగ నుండును.

7. మం॥ తస్యా ఉపస్థానం గాయత్ర్యస్యేకపదీ ద్విపదీ త్రిపదీ చతుష్పద్యపదసి నహి పద్యసే నమస్తే తురీయాయ దర్శతాయ పదాయ పరోరజసేఽసా వదో మా ప్రాపదితి యం ద్విష్యా దసావస్మై కామో మా సమర్ధీతి వా నహైవాస్మై స కామ ఋధ్యతే యస్మా ఏవ ముపతిష్ఠతేఽహ మదః ప్రాపమితి వా.

అవ :- పూర్వము చెప్పిన యర్థమునే సంగ్రహించి దార్ఢ్యమునకై తిరిగి చెప్పుచు విశేష ఫలములను వక్కాణించుచున్నాడు.

అ॥ తస్యాః = ఆ గాయత్రి యొక్క, ఉపస్థానం = ప్రార్థనము (చెప్పబడుచున్నది) గాయత్రి = ఓ గాయత్రీ నీవు, ఏకపదీ అసి = ముల్లోకము లనెడు మొదటి పాదము కలిగినదానవై యున్నావు, ద్విపదీ= వేదత్రయ రూపముతో రెండవ పాదము కలిగి యున్నావు, త్రిపదీ = ప్రాణాపాన వ్యాన రూపముగ మూడవ పాదము కలిగి యున్నావు, చతుష్పదీ = పరోరజా రూపమున నాల్గవ పాదము కలిగిన దానవు, అసి= అయి వున్నావు, అపత్ అసి = ఉపాధిరహితమైన స్థితిలో పాదము లేని దానవై యున్నావు, నహి పద్యసే = నీవు తెలియబడవు (నిరుపాధికముగ) తురీయాయ = నాల్గవదియగు, పరోరజసే = పరోరజ యను, దర్శతాయ పదాయ = కనబడునట్లుండు పాదము గల, తే = నీకు, నమః = నమస్కారము, అసౌ = నిన్ను పొందుటకు విఘ్నముచేయు శత్రువు, మా ప్రాపత్ = నా దరి జేరకుండు గాక! ఇతి = అని, యం ద్విష్యాత్ = ఎవనిని ద్వేషించునో (వానిని) అసౌ = ఈ శత్రువు, అస్మై = ఈ పేరు గల శత్రువు కొఱకు, కామః = కోరిక, మా సమృద్ధి వా = సమృద్ధి పొంచక పోవుగాక యని గాని, యస్మై=ఏ శత్రువు కొఱకు, ఏవం = ఈ ప్రకారము, ఉపతిష్ఠతే = గాయత్రిని ఉపాసించునో అస్మై = ఈ శత్రువు కొఱకు, సః కామః = ఆ కోరిక, న హ ఏవ ఋధ్యతే = ఫలింపదు, అహం = నేను, అదః = ఈ శ్రేయస్సును. ప్రాపమితి వా = పొందినవాడ నయితినని, యః = ఎవడు, గాయత్రీం = గాయత్రిని గూర్చి, ఉపతిష్ఠతే = ధ్యానించునో, సః = వాడు, తత్ప్రాప్నోతి = దానిని పొందును.

తా॥ ఓ గాయత్రీ నీకు భూర్భువస్స్వర్లోకములు ప్రథమ పాదము, ఋగ్య జుస్సామములు రెండవ పాదము, ప్రాణాపాన వ్యానములు తృతీయ పాదము అయి యున్నవి. ఎనిమి దక్షరములు గల "పరోరజసి సావదోమ్" అనునది నాల్గవపాదముగ వ్యవహరింప బడుచున్నది. అది ప్రణవ స్వరూపమైన నిర్గుణ పరబ్రహ్మమును బోధించుచున్నది. నిర్గుణ పరబ్రహ్మాత్మికమైన నీకు పాద నిబంధనమేల? అపుడు పాదములు లేనిదానవే. నిన్ను ధ్యానించిన యెడల విఘ్నములు దూరమగును. నీ స్వరూపమును గ్రహించిన వానికి శత్రువులుండరు. శత్రునిబర్హణమును గూర్చి నిన్ను ధ్యానించిన యెడల శత్రువులు నశింతురు. అభ్యుదయము నకై ఉపాసించిన వానికి అభ్యుదయము కలుగును. కావున గాయత్ర్యుపాసనము ఇహమునకు పరమునకు గూడ ఉపక రించును.

8. మం॥ ఏతద్ధవై తజ్జనకో వైదేహో బుడిల మాశ్వ తరాశ్వి ముయవాచ। యన్ను హో యద్గాయత్రీ విదబ్రూథా. అథ కథగ్ం హస్తీభూతో వహసీతి ముఖగ్ం హ్యస్యాస్సమ్రాణ్ణవిదాంచకారేతి హోవాచ తస్యా అగ్నిరేవ ముఖం యదిహవా అపి బహ్వివాగ్నా వభ్యాదధతి సర్వమేవ తత్సన్దహ్యత్యేవగ్ంహైవైవం విద్యద్యపి బహ్వివ

పాపం కురుతే సర్వమేవ తత్సమ్ప్సాయ శుద్ధః
పూతోఽజరోఽమృత స్సంభవతి.

అవ-: జనక మహారాజు అశ్వతరాశ్వ పుత్రుడైన బుడిలునకు గాయత్రీ ముఖ మహిమను తెల్పుట.

అ॥ వైదేహః జనకః = విదేహదేశ ప్రభువైన జనకమహారాజు అశ్వతరాశ్విం బుడిలం = అశ్వతరాశ్వ పుత్రుడైన బుడిలుని గూర్చి, ఏతత్ హవై ఉవాచ = ఈక్రింది విషయమును చెప్పెను. యన్నుహో = ఏమనగా- గాయత్రీ విత్ = గాయత్రీ వేత్తనని, యత్ అబ్రూథా = నీవు చెప్పితివి. అథ = అట్లయిన, హస్తీ భూతః = హస్త దోషము కలవాడవు, కథం వహసే = ఎట్లు మెలగుచున్నావు ? హే సమ్రాట్ = ఓ మహారాజా ! అస్యాః ముఖం = ఈ గాయత్రీ దేవి యొక్క ముఖమును, నవిదాంచకార = తెలిసికొనలేదు. ఇతి హ ఉవాచ = అని యిట్లు పలికెను. తస్యాః = ఆ గాయత్రికి, అగ్నిరేవ ముఖం = అగ్నియే ముఖము. అగ్నౌ = అగ్నియందు, బహు ఇవ = పెక్కు కట్టెలను, అభ్యాదధతి యదిహ వా అపి = ఉంచిన యెడల, తత్ సర్వమేవ = వాటి నన్నిటిని, సందహ్యతి = దహించుచున్నది, ఏవం హ ఏవ = ఈ విధముగనే, ఏవం విత్ = ఈ గాయత్రీ ముఖమును తెలిసినవాడు, బహు పాప మివ కురుతే = ఎంత పాపము చేయుచున్నాడో, తత్ సర్వమేవ = అది యంతయు, సంప్సాయ = దహింపజేసి, శుద్ధః = పరిశుద్ధుడును, పూతః = పవిత్రుడును, అజరః = ముదిమి లేనివాడును, అమృతః = మరణము లేనివాడును. సంభవతి = అగుచున్నాడు.

తా॥ జనక మహారాజు అశ్వతరాశ్వ కుమారుడైన బుడిలునకు గాయత్రీ ముఖ మహిమను బోధించుట. ఓ

బుడిలా నీవు గాయత్రిని గూర్చి తెలియునని చెప్పితివి. ఏన సి హస్తములకు ప్రతి గ్రహ దోషమెట్లు వాటిల్లినది ?

బుడిలుడనెను. రాజా ! నేను గాయత్రీ ముఖమును గూర్చి తెలిసికొనలేదు. అందువలన ఈ పాపము వాటిల్లినది.

ఓయీ! గాయత్రీ ముఖము అగ్ని స్వరూపముగ గుర్తింపుము. అగ్నియందు ఎన్ని కట్టియలను వేసినను అన్నిటిని భస్మ మొనర్చును. అటులనే గాయత్రీ ముఖ విషయక జ్ఞానము ఎన్ని పాపముల నైన నిర్మూలించును. కావున దానిని తెలిసికొని ధ్యానింపుము. తద్విజ్ఞానము కల ఉపాసకుడు పరిశుద్ధుడై పవిత్రాత్ముడై జరామరణ భయము నుండి విముక్తుడగును.

# బ్రహ్మ సూత్రములలో గాయత్రి

ప్రథమాధ్యాయము-ప్రథమ పాదము-పంచమాధికరణము.

అవ :- ఛాందోగ్యములో నిర్దేశింపబడిన గాయత్రీ పదము పర బ్రహ్మ పరమే కాని కేవల వర్ణ సంఖ్యానియమ బద్ధమగు ఛందః పరము కాదని యిచట నిరూపింప బడుచున్నది.

సూ :- జ్యోతిశ్చరణాభి ధానాత్ 1-1-24

అ॥ జ్యోతిః = ఈ క్రింది ఛాందోగ్య మంత్రములోని జ్యోతిః పదము పరబ్రహ్మ వాచకము. చరణాభిధానాత్ = "సైషా చతుష్పదా

షడ్విధా గాయత్రీ తదేతదృచాభ్యనూక్తం" అనెడి (3-12-5) మంత్రములో నాల్గు పాదములని చెప్పబడినందున.

మం॥ అథ య దతః పరో దివో జ్యోతిర్దీప్యతే విశ్వతః పృష్ఠేషు సర్వతః పృష్ఠే ష్వను త్తమేషు లోకే ష్విదం వా వ త ద్యదిద మస్మిన్నంతః పురుషే జ్యోతిః (ఛాం. 3-13-7)

ఛాందోగ్యములోని యీ మంత్రము గాయత్రీ బ్రహ్మోపాసనా ప్రకరణము తరువాత చెప్పబడినది. సమస్త ప్రాణి వర్గమునకును భూరాది నిఖిల లోకముల కంటె పైన నుండు సర్వోత్తమ లోకములలో ఏ జ్యోతిస్సు వెలుగుచున్నదో అదియే పురుషుని హృదయ కోశమున వెల్గుచున్నది.

ఇచట చెప్పబడిన జ్యోతిస్సు మామూలుగా మనకు కనబడెడు వెలుగుకాదు. దీప్యతే అను పదము వలన దీపించునది యని అర్థమైనను హృదయాకాశములో వెలుగునది. కనుపించునది కాదు. అది బ్రహ్మ స్వరూపమైనది "అశబ్ద మస్పర్శమరూప మవ్యయమ్" అని కఠోపనిషత్తులో బ్రహ్మ స్వరూపము వర్ణింపబడినది. అందు బ్రహ్మము రూప రహితమని ప్రోక్తమనబడెను.

ఛాందోగ్యము ద్వాదశఖండము 6 వ మంత్ర మిట్లున్నది—

"తావానస్య మహిమా తతో జ్యాయాగ్ంశ్చ పురుషః।
పాదోఽస్య సర్వాభూతాని త్రిపాద స్యామృతం దివీతి".

అనగా పూర్వ మంత్రమున (సైషా చతుష్పదా) చెప్పబడిన చతుష్పాత్త్వము ఉపాస్యముగా చెప్పబడిన గాయత్రీ రూపమైన పరబ్రహ్మమునకు చెందినది. బ్రహ్మమునకు సర్వ భూతము లోక పాదమనియు ద్యులోకమున మిగిలిన మూడు పాదము లున్నవనియు దీని యర్థము. ఇది సర్వ వ్యాపకత్వమునకు సూచనయే కాని ఆ లోకములు అవధికాదు. సర్వ భూతములు దీనికి పాదము అనుటచే గాయత్రీ ఛందస్సున కన్వయింపదు. జ్యోతిర్దీప్యతే అను పదములను బట్టి చక్షుర్గోచరదీప్తి యనరాదు. "యేన సూర్య స్తపతి తేజసేద్ధః" అను మంత్రమున తేజః పదము సమస్త జగదవభాసకమైన బ్రహ్మమును తెల్పుచున్నది. గాయత్రీ వా ఇదగ్ం సర్వమ్మను మంత్రమున ఈ కనబడున దంతయు గాయత్రి యని చెప్పుట బ్రహ్మ విషయ మనిన గాని కుదురదు.

"భూతాది పాద వ్యపదేశో పపత్తేశ్చైవమ్" (సూ. 26) భూతము పృథివి శరీరము హృదయము అను నాలుగు గాయత్రికి నాలుగు పాదము లని చెప్పుట సమంజసము కావలె నన్న గాయత్రీ పదమునకు బ్రహ్మమని యర్థముచెప్పవలెను.

అప్పుడే "పాదోఽస్య సర్వా భూతాని, త్రిపాద స్యామృతం దివి" అను మంత్రము కూడ అన్వయించును.

పైనదెల్పిన బ్రహ్మసూత్రములు ఛాందోగ్యములో ఉపాస్యముగా చెప్పబడిన గాయత్రి పరబ్రహ్మ స్వరూపమనుట తెలియవలెను. అదియే మన బుద్ధి వృత్తులను ప్రేరేపించు అత్యుత్తమమైన స్వయం ప్రకాశమైన సంవిదాత్మకమైన తేజస్సని గ్రహింపవలెను.

# స్కాంద పురాణము-గాయత్రి

(కాశీ ఖండము-నవమాధ్యాయము-గాయత్రీ మహాత్త్వ వర్ణనము)

శ్లో॥ ఉపలభ్య చ సావిత్రీం నోపతిష్ఠేత యః పరామ్।
కాలే త్రికాలం సప్తాహాత్ స పతేన్నాత్ర
సంశయః॥ 41

తా॥ ఏ ద్విజుడు గాయత్రిని ఉపదేశము పొందియు ప్రాతర్మధ్యాహ్న సాయంకాలములందు సకాలమున నుపాసింపక ఏడు దినములు గడుపునో అతడు పతితుడగు ననుటలో సందియము లేదు.

శ్లో॥ తావ త్ప్రాతర్జపం స్తిష్ఠే ద్యావ దర్కోదయో రవేః।
ఆసన స్థో జపే న్సాయం ప్రత్య గాతార
కోదయాత్ ॥ 42

తా॥ గాయత్రీ జపము సూర్యోదయమునకు గంట ముందుగ మొదలు పెట్టి తూర్పు ముఖముగా నిలువబడి చేయుచు సూర్యుడు సగము కనబడు వరకు జపము చేయవలెను సాయంత్రము ఆసనముపై కూర్చొని సగము సూర్యుడుండగ మొదలిడి నక్షత్రము లుదయించు వరకు పడమట ముఖముగా జపించవలెను.

శ్లో॥ మాదిత్యాం మధ్యమాం సంధ్యాం జపే దాదిత్య
సమ్ముఖః।
కాలలోపో న కర్తవ్య స్తతః కాలం ప్రతీక్షయేత్ ॥ 43

తా॥ మధ్యాహ్న సంధ్యను సూర్యున కెదురుగా నిలుచబడి జపించవలెను. సంధ్యా కాలమును దాటక దానికై నిరీక్షింపవలెను.

శ్లో॥ కాలే ఫలన్త్యోషధయః కాలే పుష్పంతి పాదపాః
వర్షంతి తోయదాః కాలే తస్మా త్కాలం
న లంఘయేత్ ॥ 44

తా॥ ఓషధులు కాలములో ఫలించును. చెట్లు తమ కాలమున పుష్పించును. మేఘములు వర్ష ఋతువున వర్షించును. కావున కాలమును అతిక్రమింపరాదు.

శ్లో॥ మందేహ దేహ నాశార్థ ముదయాస్తమయే రవిః।
సమిహతే ద్విజోత్సృష్టం మంత్ర
తోయాంజలిత్రయమ్॥ 45

తా॥ సూర్యుడు ఉదయాస్తమయములలో మందేహ రాక్షసుల వినాశము కొరకు ద్విజులు సమర్పించెడి గాయత్రీ మంత్రితమైన మూడు దోసిళ్ళ నెటికై నిరీక్షించుచుండును.

శ్లో॥ గాయత్రీ మంత్ర తోయాఘ్యం దత్తం యే
నాంజలిత్రయమ్।
కాలే సవిత్రే కిం న స్యాత్తేన దత్తం
జగత్త్రియమ్॥ 46

తా॥ గాయత్రీ మంత్రపూతమైన జలము గల మూడు దోసిళ్లు సకాలమున సూర్యున కెవరు సమర్పించునో అతడు ముల్లోకములను దానము చేసిన వాడగును.

శ్లో॥ కిం కిం న సవితా సూతే కాలే సమ్యగుపాసితః।
ఆయురారోగ్యమైశ్వర్యం వసూని పశూని చ॥ 47

తా॥ సకాలమున యథా విధి ఉపాసింపబడిన సూర్యుడు ఆయురారోగ్యములను, ఐశ్వర్యమును, ధనము, పశువులను, సమస్తము నొసగును.

శ్లో॥ మిత్ర పుత్ర కళత్రాణి క్షేత్రాణి వివిధానిచ।
భోగా నష్ట విధాంశ్చాపి స్వర్గం చాప్యప
వర్గకమ్॥ 48

తా॥ గాయత్రీ జప పరునకు మిత్ర-పుత్ర-కళత్రములు వివిధ క్షేత్రములు అష్ట విధ భోగములు స్వర్గాపవర్గములు లభించును.

శ్లో॥ అష్టాదశసు విద్యాసు మీమాంసాతిగరీయసీ।
తతో౽పి తర్క శాస్త్రాణి పురాణే తేభ్య
ఏవ చ। 49

తతో౽పి ధర్మ శాస్త్రాణి తేభ్యో గుర్వీ శ్రుతి ర్ద్విజ
తతో౽ప్యుపనిషచ్ఛ్రేష్ఠా గాయత్రీచ తతో౽ధికా
దుర్లభా సర్వ మంత్రేషు గాయత్రీ ప్రణవాన్వితా
న గాయత్ర్యధికం కించి త్త్రయీషు పరిగీయతే॥

తా॥ అష్టాదశ విద్యలందు మీమాంస గొప్పది. తర్క శాస్త్రము లంతకంటెగొప్పవి. వానికన్న పురాణములు వానికంటె ధర్మ శాస్త్రములు వానికన్న వేదము శ్రేష్ఠమైనది. అందుకు ఉపనిషత్తు శ్రేష్ఠము. అంతకంటె గాయత్రి గొప్పది, ప్రణవ సహితమైన గాయత్రి అన్ని మంత్రములలో లభించునది కాదు. కావున వేదములలో గాయత్రికి మించినది ఎద్దియు లేదని కీర్తింప బడుచున్నది.

శ్లో॥ న గాయత్రీ సమో మంత్రో నకాశీ స దృశీపురీ
న విశ్వేశసమం లింగం సత్యం సత్యం పునః పునః॥

తా॥ గాయత్రితో సమానమగు మంత్రము లేదు. కాశీతుల్యమగు పట్టణము లేదు. విశ్వేశ్వరునితో సదృశమైన లింగము లేదు. ఇది ముమ్మాటికి సత్యము.

శ్లో॥ గాయత్రీ వేద జననీ గాయత్రీ బ్రాహ్మణ ప్రసూః।
గాతారం త్రాయతే యస్మాద్గాయత్రీ తేన
గీయతే॥ 53

తా॥ గాయత్రి వేదమాత. గాయత్రి బ్రాహ్మణులకు జనని. గాతారం = జపించువానిని, త్రాయతే = రక్షించును గాన ఆ మంత్రమునకు గాయత్రి యని పేరు వచ్చెను.

శ్లో॥ వాచ్యవాచక సంబంధో గాయత్ర్యాః
సవితుర్ద్వయోః!
వాచ్యోఽసౌ సవితా సాక్షా ద్గాయత్రీ వాచికా
పరా॥ 54

తా॥ గాయత్రి సవిత వీరిద్దఱకు వాచ్య వాచక సంబంధము కలదు. అందు సవిత సాక్షాత్తుగ వాచ్యుడగును. గాయత్రి వాచక మగును. ఇచట సవిత యనగా సూర్యుడని సామాన్యార్థము. జగత్ప్రసవిత (సృష్టికర్త)యని విశేషార్థము.

శ్లో॥ ప్రభావేణైవ గాయత్ర్యాః క్షత్రియః కౌశికో వశీ
రాజర్షిత్వం పరిత్యజ్య బ్రహ్మర్షి పదమీయివాన్॥ 55

శ్లో॥ సామర్థ్యం ప్రాప చాత్యుచ్చైరన్య ద్భువన సర్జనే।
కిం కిం నదద్యా ద్గాయత్రీ సమ్యగేవ ముపాసితా॥ 56

తా॥ క్షత్రియుడైన విశ్వామిత్రుడు గాయత్రీ మంత్రానుష్ఠాన ప్రభవము వలననే జితేంద్రియుడై రాజర్షిత్వమును విడచి బ్రహ్మర్షిత్వమును పొందెను. అంతయేకాదు

వేరొక బ్రహ్మాండమును సృజించు సామర్థ్యము పొందెను. విధి విధానముతో అటుల నుపాసించిన వానికి గాయత్రీ దేవి ఏదిమాత్రమీయదు ?

శ్లో॥ న బ్రాహ్మణో వేద పాఠా న్న శాస్త్ర పఠనాదపి,
దేవ్యాస్త్రికాల మభ్యాసాద్ బ్రాహ్మణ
స్స్యాద్ద్వి నాన్యథా॥ 57

తా॥ వేద పాఠము వలనను, శాస్త్రాభ్యాసము వలనను బ్రాహ్మణత్వము రాదు. త్రికాలముల యందు గాయత్రీ దేవిని ఉపాసించుట వలన బ్రాహ్మణత్వము సిద్ధించును. మరియొక విధమున రాదు

శ్లో॥ గాయత్ర్యేవ పరం విష్ణుః గాయత్ర్యేవ పరశ్శివః।
గాయత్ర్యేవ పరో బ్రహ్మ గాయత్ర్యేవ త్రయీతతః॥

తా॥ గాయత్రియే విష్ణుమూర్తి. గాయత్రియే పరమ శివుడు. గాయత్రియే బ్రహ్మదేవుడు. కావున వేదత్రయము గాయత్రియే.

సారాంశము :- సూర్యలోక వర్ణన సందర్భముగ గాయత్రీ మహత్త్వము పై విధముగ వివరింపబడినది. బ్రాహ్మణత్వము గాయత్రీ జపముపైననే ఆధారపడి యున్నది. సంధ్యా కాలము ముఖ్యము. ఏడు దినములు వరుసగా గాయత్రిని వదలినవాడు పతితుడగును. ఫల పుష్ప సస్యాదులు తమ

కాలమున విత్తిన పంటమనటుల, మేఘములు ఒకానొక కాలమున వర్షించినట్లు గాయత్రి కూడ సకాలమున జపించినపుడే సమగ్ర ఫలదాయక మగును. అనగా ఆయురారోగ్యైశ్వర్యాదులైన ఐహిక ఫలములు, ఉత్తమలోక ప్రాప్తియను ఆముష్మిక ఫలమును సమకూడును. రాజర్షియైన విశ్వామిత్రునకు బ్రహ్మర్షిత్వమును ప్రసాదించినది గాయత్రియే. గాయత్రికి మించిన మంత్రము, కాశికి మించిన క్షేత్రము లేదు. తర్కమీమాంసాది శాస్త్రముల కన్న శ్రుతి గొప్పది. శ్రుతులలో ఉపనిషత్తులు శ్రేష్ఠములు వానికన్న గాయత్రి శ్రేష్ఠమైనది. చక్కగా ఉపాసించిన యెడల గాయత్రి యివ్వనిదేమి కలదు? బ్రాహ్మణత్వము నిలువవలెనన్న వేదాధ్యయనము వలన శాస్త్రపఠనము వలన కాదు. గాయత్రిని త్రిసంధ్యల యందుపాసించుట ఒక్కటే మార్గము. బ్రహ్మ విష్ణు మహేశ్వరులు-వేదములు ఇవి యన్నియు గాయత్రి యందే ఉన్నవి. సమస్త భువనములు గాయత్రి యందే ఉన్నవి. దీనిని బట్టి గాయత్రీదేవికి మందమధ్యమాధికారుల యుపాసనకై ముక్తా విద్రుమాది వర్ణ ముఖములు గల రూపము, బుద్ధి వృత్తులకు ప్రేరకమైన చిచ్ఛక్తియు కలదని తెలియుచున్నది.

# పద్మ పురాణము-గాయత్రి

## సృష్టి ఖండము - 48 వ అధ్యాయము

### నారదుడు బ్రహ్మను ప్రశ్నించుట :

శ్లో॥ గాయత్ర్యా లక్షణం కిం వా ప్రత్యేకాక్షరజం గుణమ్।
కుక్షి చరణ గోత్రాణాం తస్యా బ్రూహి
సునిశ్చయమ్॥

తా॥ దేవా! గాయత్రి సర్వోత్తమమని చెప్పుదురు. దాని లక్షణమేమి? అందలి యొక్కొక్క యక్షరమున కేమి గుణము? దాని కుక్షి యెద్ది? చరణమెద్ది? గోత్రమెద్ది? నాకు నిస్సంశయముగ దెల్ప బ్రార్థన.

### బ్రహ్మ పలుకుట :-

శ్లో॥ ఛన్దో గాయత్రీ గాయత్ర్యాః సవితా దేవతా ధ్రువమ్।
శుక్లవర్ణా త్వగ్నిముఖా విశ్వామిత్ర ఋషి స్తథా
బ్రహ్మణ శ్శిర ఆరూఢా రుద్ర విష్ణు హృది స్థితా
ఉపనయనే నియోగః స్యాత్సాంఖ్యాయన గోత్రజా॥

తా॥ గాయత్రీ మంత్రమునకు గాయత్రి ఛందస్సు, దేవత సవిత, వర్ణము శుక్లము, అగ్నిముఖము, విశ్వామిత్రుడు

ఋషి, బ్రహ్మ శిరస్సు, రుద్ర విష్ణువులు హృదయము సాంఖ్యాయన గోత్రము, ఉపనయన కాలమున దీనికి విని యోగము అనగా అది ఉపదేశకాలము.

శ్లో॥ త్రైలోక్య చరణా జ్ఞేయా పృథివీ కుక్షిసంస్థితా।
చతుర్వింశతి స్థానే చ పాదాదా మస్తకాంతకే॥
చతుర్వింశత్యక్షరా న్యస్య బ్రహ్మలోకం స విన్దతి
ప్రత్యర్ణ దేవతాం జ్ఞాత్వా విష్ణు సాయుజ్య
మాప్నుయాత్॥

తా॥ గాయత్రీదేవికి త్రిలోకములే చరణములు. పాదములు మొదలు శిరస్సు వరకు (24) చతుర్వింశ త్యక్షరములను న్యాసము చేసిన యెడల బ్రహ్మ లోకమును పొందును. ప్రతివర్ణము యొక్క దేవతను తెలిసికొనిన యెడల విష్ణు సాయుజ్యము పొందును.

శ్లో॥ గాయత్రీం యో జపే న్నిత్యం ప్రాణాయామ
సమన్వితామ్
ప్రత్యక్షరా మరైర్న్యస్తాం స్వాంగే విన్యస్య తామపి
సర్వపాపా ద్వినిర్ముక్తో జన్మకోటి కృతాదపి
బ్రహ్మణః పదవీం ప్రాప్య స గచ్ఛేత్ ప్రకృతేః పరమ్
ప్రాణాయామయుతాం తస్మాద్ గాయత్రీం జప
నారద.

తా॥ గాయత్రీ మంత్రాక్షరము లన్నిటిని తమ యంగము లందు న్యాసముచేసి ప్రాణాయామ పురస్సరముగ నెవడు గాయత్రిని జపించునో అతడు కోటి జన్మల నుండి చేసిన పాపముల నుండి విముక్తుడగును. అనగా ప్రకృతిని దాటి బ్రహ్మలోకమును పొందును. కావున నారదా! ప్రాణాయామ పురస్సరముగ గాయత్రిని ఉపాసింపుము.

స్వామీ ప్రాణాయామము లెట్లు చేయవలెను? ప్రతి యక్షరమునకు దేవతలెవరు? వారిని ఏయే యంగములందు న్యాసము చేయవలెను? అని నారదుడు ప్రశ్నింప బ్రహ్మ ఇట్లనెను:

మానవునకు గుదప్రదేశమున అపానముండును. హృదయమున ప్రాణముండును. కావున గుదమును బిగించి దానిని ప్రాణముతో జేర్చవలెను. అప్పుడు పూరకముతో కుంభకము చేసి అటుపై రేచక మొనర్పవలెను. ఇటుల ముమ్మారు ప్రాణాయామ మొనర్చి గాయత్రిని జపించవలెను. ప్రతివర్ణ స్వరమును తెలిసికొని యెవడు తన దేహమున దేవతలను న్యాసము చేయునో అతడు బ్రహ్మత్వము పొందును. తత్ఫలము వర్ణింప నలవికాదు. ప్రత్యక్షరమునకు ఏ యే దేవతలుందురో చెప్పెదను వినుము. అటుల జపించినవానికి తిరిగి తల్లి పాలు త్రాగనలసిన పనిలేదు.

## 24 అక్షరములకు అధిదేవతలు

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | తత్ | అగ్ని | 13. | స్య | త్వష్ట |
| 2. | స | వాయువు | 14. | ధీ | వసువులు |
| 3. | వి | సూర్యుడు | 15. | మ | మరుత్తు |
| 4. | తుర్ | ఆకాశము | 16. | హి | సోముడు |
| 5. | వ | యముడు | 17. | ధి | అంగిరసుడు |
| 6. | రే | వరుణుడు | 18. | యో | విశ్వేదేవతలు |
| 7. | ణి | బృహస్పతి | 19. | యో | అశ్వినులు |
| 8. | యం | పర్జన్యుడు | 20. | నః | ప్రజాపతి |
| 9. | భర్ | ఇంద్రుడు | 21. | ప్ర | అక్షరము (తత్త్వము) |
| 10. | గో | గంధర్వుడు | 22. | చో | రుద్రుడు |
| 11. | దే | పూష | 23. | ద | బ్రహ్మ |
| 12. | వ | మిత్రుడు | 24. | యాత్ | విష్ణువు. |

జపకాలమున ఆయా దేవతలను తలచిన వారి యందు సాయుజ్యము కలుగును. ఇది సాధ్యమగు టెట్లందురా? నిరంతర భావనచే సాధ్యమగును. 'తత్' అను వర్ణము తలచినపుడే అగ్ని తోచవలెను. 'స' అని తలపగనే వాయువు తోచవలెను. వేల పర్యాయములు వర్ణములతో బాటు ఆయా దేవతలను స్మరించుచుండవలెను. ఈ పని విడిగా చేయవలెను. వృక్షము అనుపదము తలచినంతనే వృక్షాకారము హృదయమున స్ఫురించునటుల గాయత్రిలోని

ఒక్కొక్క వర్ణము తలచుచున్నప్పుడే ఆయా అధిదేవతలు స్ఫురణకు రావలెను. అట్లు సాధన చేసిన తరువాత జపము చేయునప్పుడు కూడ ఆయా దేవతలు అతివేగముగ స్ఫురణకు వత్తురు. అందుచే గాయత్రి సర్వదేవతామయ యను నిరూఢి కలుగును.

సకల దేవతలను గాయత్రి యందు భావించినట్లుల గాయత్రీదేవిని తన శరీరమున భావింపవలెను. ఇరువదినాలుగు అక్షరములు 24 అవయవముల నున్నట్లుల భావించుచూ ఆయా అవయవములను స్పృశింపవలెను.

1. తత్ కాలి బొటనవ్రేళ్లు
2. స సీలమండలు
3. వి పిక్కలు
4. తుర్ మోకాళ్లు
5. వ తొడలు
6. రే మర్మాంగము
7. ణి వృషణములు
8. యం నడుము
9. భర్ నాభి

13. స్య చేతులు
14. ధీ నోరు
15. మ దవడలు
16. హి ముక్కుకొన
17. ధి కన్నులు
18. యో కనుబొమల మధ్య
19. యో లలాటము
20. నః ముఖము పై భాగము
21. ప్ర ముఖము కుడి భాగము

| | | | | | |
|---|---|---|---|---|---|
| 10. | గో | పొట్ట | 22. | చో | ముఖమున క్రింది భాగము |
| 11. | దే | స్తనములు | 23. | ద | ముఖము ఎడమభాగము |
| 12. | వ | హృదయము | 24. | యాత్ | శిరస్సు |

ఇటుల న్యాసము చేసినవాడు బ్రహ్మ విష్ణు శివాత్మకుడై మహా యోగియై మహా జ్ఞానియై మోక్షము పొందును.

సంధ్యావందన కాలమున న్యాసము లిట్లు చేయవలెను.

ఓం భూః-హృదయమును ఓం భువః-శిరస్సును
ఓగ్ం సువః-శిఖను ఓం తత్సవితుర్వరేణ్యం-కళేబరమును
ఓం భర్గోదేవస్యధీమహి-నేత్రములను, ఓం ధియోయోనః ప్రచోదయాత్-హస్తములను

స్పృశించి ఓమాపోజ్యోతీరసోమృతం భూర్భువస్సువరోమ్-అని ఉదకమును స్పృశింపవలెను. ఇట్లు చేసిన పవిత్రుడై అంతమున హరినిజేరును.

ఓం భూః, ఓం భువః, ఓగ్ం సువః, ఓం మహః, ఓం జనః ఓం తపః, ఓగ్ం సత్యం, ఓం తత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి ధియోయోనః ప్రచోదయాత్ ఓమాపోజ్యోతీరసోమృతం బ్రహ్మ భూర్భువస్సువరోమ్. అని సప్త వ్యాహృతులతో పది ప్రణవములతో సంధ్యావందనములోని ప్రాణాయామ కాలమున కుంభకములో మూమ్మారు

జపించి సూర్యోపస్థానమున చతుర్వింశత్యక్షరాత్మకమైన గాయత్రిని జపించినచో మహా విద్యాధికుడగును. బ్రహ్మత్వము కూడ లభించును.

ఇక షట్కుక్షి గల గాయత్రిని వినుము.

"ఓం తత్స వితుర్వరేణియం భర్గో దేవస్య ధీమహి ధియో యో నః ప్రచోదయాత్"

దీనిని గుర్తించి సాధనము చేసిన ద్విజుడు పరబ్రహ్మస్థానమును పొందును.

ఇక పంచశీర్షమైన గాయత్రి :

"ఓం భూః ఓం భువః ఓగ్ం సువః ఓం మహః ఓం జనః ఓం తపః ఓగ్ం సత్యం ఓం తత్స వితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి ధియో యో నః ప్రచోదయాత్"

సవ్యాహృతిమైన గాయత్రికి జపాంతమున మరల న్యాసము చేయవలెను. దానిచే సర్వ పాప విముక్తుడై విష్ణు సాయుజ్యమును పొందును. ఎట్లన :-

ఓం భూః - పాదములను, ఓం భువః - మోకాళ్ళను, ఓం స్వః - నడుమును, ఓం మహః - నాభిని, ఓం జనః - హృదయమును. ఓం తపః - చేతులను, ఓం సత్యం - లలాటమును, ఓం తత్స వితుర్వరేణియం భర్గోదేవస్య ధీమహి ధియోయోనః ప్రచోదయాత్ - అని శిఖను, స్పృశింప

వలెను. ఇటుల తెలియనివాడు బ్రాహ్మణాధముడు. అతని పాపములు నశింపవు. అతనిని ప్రతి గ్రహ దోషము ఆవహించును. (సువః అనుదానికి స్వః పాఠాంతరము)

పై విధముగ సర్వబీజ సమన్వితమైన గాయత్రిని ఎవరు తెలిసికొందురో వారు చతుర్వేదముల నెరిగినవారగుదురు. ఎవరు తెలిసికొనరో వారు శూద్రులకన్న తక్కువవా రగుదురు. వారు పితృ కార్యములకు పనికిరారు. వారొనర్చిన కర్మ యంతయు అశుచి ప్రదేశమున పడిన పుష్పమువలె అపవిత్రమగును.

పూర్వము చతుర్వేదముల నొక సిబ్బియందును, గాయత్రి నొక సిబ్బియందును పెట్టి తూచగా గాయత్రియే బరువైనందున అదియే మోక్ష మొసంగునని నిశ్చయింపబడినది. నిత్యము పదిమారులు జపించిన ఆ జన్మలోని పాపములు, నూరుమారులు జపించిన పురాకృతములు, సహస్ర జపముచే మూడు యుగముల పాపములును నశించును.

ఎవడు గాయత్రిని సాయం ప్రాతః కాలములందు అక్షమాలతో జపించునో అతడు చతుర్వేద పారాయణ ఫలమొందును. మూడు వేళలను గాయత్రిని సంవత్సర కాలము జపించినచో అతడు కోటి జన్మలలో చేసిన పాపము నశించును. (తరువాత అవసరము లేదని తలపరాదు.

ఇంకెంత పుణ్యమో యని యూహింపవలెను.) గాయత్రిని ఉచ్చరించిన మాత్రాన పాప పుంజము నుండి విడివడును. (అక్షమాల అకారాది క్షకారాంతము 50 వర్ణములనెడి మాల ముందు వెనుకలకు నడిచిన 100 అగును. ఎట్లన -అం ఓం భూర్భువస్సువః, ఆం ఓం భూర్భువస్సువః, ఇం ఓం భూర్భువస్సువః ఈం ఓం భూర్భువస్సువః తిరిగి చివర నుండి క్షం ఓం భూర్భువస్సువః, ళం ఓం భూర్భువస్సువః, హం ఓం భూర్భువస్సువః (స్ఫటిక మాలకు రుద్రాక్ష మాలకు గూడ అక్షమాల యని పేరు సంధ్యలో మాత్రము వ్రేళ్ళ కణుపులపై లెక్కించవలెను.)

# శ్రీ దేవీ భాగవతము-గాయత్రి

## ద్వాదశ స్కంధము

నారదునకు నారాయణుడు చెప్పుట :

సంధ్యా కాలమునందు భక్తితో నర్ఘ్య మొసగి గాయత్రిని మూడు వేలు జపించు మానవుని దేవేంద్రుడైనను గద్దె దిగి పూజింపవలెను. గాయత్రి యందు ఒక్కొక్క యక్షరము సిద్ధించిన యెడల హరి బ్రహ్మాదులతో పోరాడు శక్తి కలుగును. (మంత్రమును లక్ష మారులు జపించిన యెడల

ఒక యక్షరము సిద్ధించును. మంత్రమున ఎన్ని యక్షరము లుండునో అన్ని లక్షలు జపించిన యెడల ఆ మంత్రము సిద్ధించి అభీష్టమును నెరవేర్చును, మఱి యొకనికి ఉపదేశ మీయవచ్చును.) గాయత్రీ మంత్రము యొక్క ప్రతి వర్ణమునకు ఋషులు ఛందస్సులు అనగా తత్సవితుః మొదలు 24 అక్షరములకు ఇరువది నాలుగు ఋషులు, 24 ఛందస్సులు 24 దేవతలు కలరు.

| అక్షరము | ఋషి | ఛందస్సు | దేవత |
| --- | --- | --- | --- |
| 1. తత్ | వామదేవుడు | గాయత్రి | అగ్ని |
| 2. స | అత్రి | ఉష్ణిక్కు | ప్రజాపతి |
| 3. వి | వసిష్ఠుడు | అనుష్టుప్ | సోముడు |
| 4. తుర్ | శుక్రుడు | బృహతి | ఈశానుడు |
| 5. వ | కణ్వుడు | పఙ్క్తి | సవిత |
| 6. రే | పరాశరుడు | త్రిష్టుప్ | ఆదిత్యుడు |
| 7. ణి | విశ్వామిత్రుడు | జగతి | బృహస్పతి |
| 8. యం | కపిలుడు | అతిజగతి | మిత్రావరుణుడు |
| 9. భ | శౌనకుడు | శక్వరి | భగుడు |
| 10. ర్గో | యాజ్ఞవల్క్యుడు | అతిశక్వరి | గణపతి |
| 11. దే | భరద్వాజుడు | ధృతి | ఈశ్వరుడు |
| 12. వ | జమదగ్ని | అతిధృతి | త్వష్ట |
| 13. స్య | గౌతముడు | విరాట్ | పూష |

| | | | | |
|---|---|---|---|---|
| 14. | గీ | ముద్గలుడు | ప్రస్తార పఙ్క్తి | ఇంద్రాగ్ని |
| 15. | మ | వేదవ్యాసుడు | కృతి | వాయువు |
| 16. | హి | లోమశుడు | ప్రకృతి | వామదేవత |
| 17. | ధి | అగస్త్యుడు | ఆకృతి | మైత్రావరుణి |
| 18. | యో | కౌశికుడు | వికృతి | విశ్వేదేవులు |
| 19. | యో | వత్సుడు | సంకృతి | విష్ణువు |
| 20. | నః | పులస్త్యుడు | అక్షర పఙ్క్తి | వసువులు |
| 21. | ప్ర | మాండూకుడు | భువి | ధర్మదేవత |
| 22. | చో | దుర్వాసుడు | భువము | రుద్రుడు |
| 23. | ద | నారదుడు | స్వర్గాత్మకము | కుబేరుడు |
| 24. | యాత్ | కశ్యపుడు | జ్యోతిష్మతి | అశ్వినీ దేవతలు |

గమనిక : గాయత్రీ మంత్రము మొత్తమునకు విశ్వామిత్రుడు ఋషి గాయత్రి ఛందస్సు సవితదేవత యని సంధ్యావందనములో నున్నది. అది యట్లుండ ప్రతి వర్ణమునకు వేరు వేరు ఋషి ఛందో దేవతలు చెప్పబడినవి. ఇందు విరోధము లేదు. ఎట్లన గ్రామమునకు ఒకడధికారిగా నున్నను, ప్రతి ఇంటికి వేరు వేరు యజమానులుండుట సమంజసమే. శక్తి వర్ణాముల యందును ఇటులనే గ్రహింపవలెను.

| అక్షరము | శక్తి | రంగు | వర్ణతత్త్వము |
|---|---|---|---|
| 1 తత్ | వామదేవి | సంపెంగపూవు | పృథివి |
| 2 స | ప్రియ | నల్లఅవిశెపూవు | జలము |

| | | | | |
|---|---|---|---|---|
| 3 | వి | సత్య | పగడము | తేజము |
| 4 | తుర్ | విశ్వ | స్ఫటికము | వాయువు |
| 5 | వ | భద్రవిలాసిని | పద్మము | ఆకాశము |
| 6 | రే | ప్రభావతి | బాలసూర్యుడు | గంధము |
| 7 | ణి | జయ | శంఖము | రసము |
| 8 | యం | శాంత | లేదామరాకు | రూపము |
| 9 | భ | కాంత | పద్మరాగము | స్పర్శము |
| 10 | ర్గో | దుర్గ | ఇంద్రనీలము | శబ్దము |
| 11 | దే | సరస్వతి | ముత్యము | ఉపస్థ |
| 12 | వ | విద్రుమ | కుంకుమ | పాయువు |
| 13 | స్య | విశాలేశి | కాటుక | పాదము |
| 14 | ధీ | వ్యాపిని | రక్తము | పాణి |
| 15 | మ | విమల | వైడూర్యము | వాక్కు |
| 16 | హి | తమోహారిణి | పసుపు | ఘ్రాణము |
| 17 | ధి | సూక్ష్మ | మొల్ల | జిహ్వ |
| 18 | యో | విశ్వయోని | పాలు | నేత్రము |
| 19 | యో | నిరయ | సూర్యకాంతి | త్వక్కు |
| 20 | నః | వశ | చిలుకతోక | శ్రోత్రము |
| 21 | ప్ర | పద్మాలయ | తెల్లకమలము | ప్రాణము |
| 22 | చో | పరశోభ | మొగలిపూవు | అపానము |
| 23 | ద | భద్ర | మల్లెపూవు | వ్యానము |
| 24 | యాత్ | త్రిపద | గన్నేరు | సమానము |

గమనిక : రంగులలో వచ్చినవి తిరిగి వచ్చినను తప్పు లేదు. ఒకే రంగులో కొన్ని అక్షరము లుండునని గ్రహించు నది. తత్త్వములను సంగ్రహముగా నిట్లు గుర్తించుకొన వచ్చును. 5 పంచ భూతములు, 5 వాని గుణములు 5 కర్మేంద్రియములు 5 జ్ఞానేంద్రియములు 4 వాయువులు ఉదానము తప్ప (ఉదానము వ్యానములో అంతర్భవించును) ఋషిచ్ఛందో దేవతాదులు గ్రంథాంతరములందు లేకుగా నున్నను అన్నియు ప్రమాణములే. ఏదో యొకదానిని అనుసరించవలెను. కవచ స్తోత్రాదులునంతయే.

# గాయత్రీ కవచము

నారాయణుడు నారదున కుపదేశించినది.

అస్య శ్రీ గాయత్రీ కవచస్తోత్ర మహా మంత్రస్య బ్రహ్మ విష్ణు మహేశ్వరా ఋషయః, ఋగ్యజుస్సామాథర్వాణి ఛందాంసి, బ్రహ్మస్వరూపా సరస్వతీ గాయత్రీ దేవతా, ఓం హ్రాం హ్రీం తద్బీజం, ఓం గీం భర్గ ఇత్యేషా శక్తిః, ఓం ధీం ధియః కీలకం, మమ నిరతిశయవిద్యైశ్వర్య సిద్ధ్యర్థం బ్రహ్మలోకావాప్త్యర్థే జపే వినియోగః.

ఓం తత్సవితుః బ్రహ్మాత్మనే అంగుష్ఠాభ్యాంనమః
(హృదయాయ నమః

,, వరేణ్యం విష్ణ్వాత్మనే తర్జనీభ్యాం నమః (శిరసేస్వాహా

ఓమ్ భర్గో దేవస్య రుద్రాత్మనే మధ్యమాభ్యాం నమః
(శిఖాయైవషట్

,, ధీమహి సత్యాత్మనే అనామికాభ్యాం నమః
(కవచాయహుం

,, ధియోయోనః జ్ఞానాత్మనే కనిష్ఠికాభ్యాం నమః
(నేత్రత్రయాయవౌషట్

,, ప్రచోదయాత్ సర్వాత్మనే కరతల కరపృష్ఠాభ్యాంనమః
(అస్త్రాయ ఫట్

భూర్భువస్సువరోమితి దిగ్బంధః

ధ్యానం :

శ్లో॥ ఆదిత్యమండల స్థానా పరబ్రహ్మ స్వరూపిణీ
ఛందోమయీ చ గాయత్రీ మాం రక్షతు సనాతనీ॥

శ్లో॥ ముక్తా విద్రుమ హేమ నీల ధవళచ్ఛాయై ర్ముఖై
స్త్రీక్షణై:

యుక్తా మిన్దునిబద్ధ రత్న మకుటాం తత్త్వార్థ
వర్ణాత్మికాం

గాయత్రీం వరదాభయాంకుశకశాః శుభ్రంభం
కపాలం గదాం

శంఖం చక్ర మథారవింద యుగళం హస్తైర్వ
హంస్తీం భజే॥

నారద ఉవాచ :

శ్లో॥ స్వామిన్ సర్వజగన్నాథ సంశయోఽస్తి మహాప్రభో।
చతుష్షష్టి కళాభిజ్ఞ పాతకా యోగవిద్వర।
ముచ్యతే కేన పుణ్యేన బ్రహ్మరూపః కథం భవేత్॥

దేహశ్చ దేవతా రూపో మంత్రరూపో విశేషతః
కర్మ తచ్ఛ్రోతు మిచ్ఛామి న్యాసం చ విధిపూర్వకం
ఋషి శ్ఛందో దైవతం చ ధ్యానం చ విధివత్ ప్రభో

నారాయణ ఉవాచ :

అస్త్యేకం పరమం గుహ్యం గాయత్రీ కవచం తథా
పఠనాత్ ధారణాన్మర్త్యః సర్వ పాపైః ప్రముచ్యతే
సర్వాన్కామా నవాప్నోతి దేవీ రూపశ్చ జాయతే
గాయత్రీ కవచ స్యాస్య బ్రహ్మ విష్ణు మహేశ్వరాః
ఋషయో ఋగ్యజుస్సామాథర్వ శ్ఛందాంసి నారద
బ్రహ్మరూపా దేవతోక్తా గాయత్రీ పరమా కళా
తద్బీజం భర్గ ఇత్యేషా శక్తిరుక్తా మనీషిభిః
కీలకంచ ధియః ప్రోక్తం మోక్షార్థే వినియోజనమ్
చతుర్భిర్ హృదయం ప్రోక్తం చతుర్భిస్తు శిరః
స్మృతమ్
పంచభి స్స్యాచ్ఛిఖా పశ్చాత్త్రిభిస్తు కవచం స్మృతమ్
చతుర్భిర్ నేత్ర ముద్దిష్టం చతుర్భి స్స్యాత్ తదస్త్రకమ్
అథ ధ్యానమ్ ప్రవక్ష్యామి సాధకాభీష్టదాయకమ్॥

శ్లో॥ ముక్తా విద్రుమ హేమ నీల ధవళ ఛ్ఛాయైర్ముఖై
స్త్రీక్షణైః
యుక్తామిన్దు నిబద్ధ రత్నమకుటాం తత్త్వార్థ
వర్ణాత్మికాం
గాయత్రీం వరదా భయాఙ్కుశకశాః శుభ్రం
కపాలం గదాం
శంఖం చక్ర మథారవింద యుగళం
హస్తైర్వహన్తీం భజే॥

శ్లో॥ గాయత్రీ పూర్వతః పాతు, సావిత్రీ పాతు దక్షిణే
బ్రహ్మ సంధ్యా తు మే పశ్చా, దుత్తరాయాం
సరస్వతీ
పార్వతీ మే దిశం రక్షేత్ పావకీం జలశాయినీ
యాతుధానే దిశం రక్షేత్ యాతుధాన భయంకరీ
పావమానే దిశం రక్షేత్ పవమాన విలాసినీ
దిశం రౌద్రీం చ మే పాతు రుద్రాణీ రుద్రరూపిణీ
బ్రహ్మాణ్యూర్ధ్వం తు మే రక్షే దధస్తాద్ వైష్ణవీ తథా
ఏవం దశదిశో రక్షేత్ సర్వాంగం భువనేశ్వరీ
తత్ పదం పాతు మే పాదౌ జంఘే మే సవితుః పదం
వరేణ్యం కటిదేశం తు నాభిం భర్గ స్తథైవ చ
దేవస్య మే తద్ధృదయం ధీమహీతి చ మే గళం

ధియః పదం చ మే నేత్రే యః పదం మే లలాటకం
నః పదం పాతు మూర్ధానం శిఖాయాం మే
ప్రచోదయాత్

తద్వర్ణః పాతు మూర్ధానం సకారః పాతు ఫాలకం
చక్షుషీ తు వికారార్ణ స్తుకారస్తు కపోలయోః
నాసాపుటం వకారార్ణో రే కారస్తు ముఖే తథా
ణి కార ఊర్ధ్వ మోష్ఠంతు యకార స్త్వధరోష్ఠకం
ఆస్య మధ్యే భకారార్ణో గో కార శ్చుబుకే తథా
దే కారః కంఠ దేశే తు వకారః స్కంధదేశకం
స్యకారో దక్షిణం హ స్తం ధీకారో వామహాస్తకం
మకారో హృదయం రక్షేత్ హి కార ఉదరే తథా
గుహ్యం రక్షతు యోకార ఊరూ ద్వౌ
నః పదాక్షరం

ప్రకారో జానుని రక్షేత్ చో కారో జంఘ దేశకం
దకారో గుల్ఫదేశేతు యాకారః పదయుగ్మకం
తకారవ్యంజనం చైవ సర్వాంగే మే సదావతు
ఇదం తు కవచం దివ్యం బాధా శత వినాశనం
చతుష్షష్టి కళా విద్యాదాయకం మోక్షకారకం
ముచ్యతే సర్వపాపేభ్యః పరం బ్రహ్మాధిగచ్ఛతి
పఠనా చ్ఛ్రవణా ద్వాపి గో సహస్ర ఫలం లభేత్
ఇతి శ్రీదేవీ భాగవతే ద్వాదశస్కంధే
గాయత్రీ మంత్ర కవచం నామ తృతీయోధ్యాయః

# కవచ స్వరూపము

దాదాపు ప్రతి మంత్రమునకును కవచ ముండును. కవచమనగా యుద్ధ సమయమున సైనికులు ధరించు లోహ మయమైన ఆవరణము. ఉక్కు లేక కంచుతో చేయబడిన లాగు, చొక్కా యనవచ్చును. మణికట్లు, మోకాళ్ళు, మోచేతులు వంచుటకు వీలుగా కీళ్ళు అమర్చబడి యుండును. ఇదికాక శిరస్త్రాణము (టోపి) ఉండును. శత్రువులు ప్రయో గించు బాణములు శరీరమునకు గ్రుచ్చుకొనకుండ ఈ కవ చము కాపాడును. ఇట్లే ఈ కవచ పఠనము వలన శరీరము యొక్క అన్ని భాగములకు రక్షణ గలుగును. ఇందు ఒక్కొక్క దిక్కున ఒక్కొక్క దేవత రక్షింప ప్రార్థన యుండును. ప్రకృత గాయత్రీ కవచమున—

గాయత్రి నా తూర్పు భాగమున, సావిత్రి నాదక్షిణ దిక్కున, సరస్వతి నా పడమటి దిక్కున పార్వతి ఆగ్నేయ మున, యక్షేశ్వరి నైఋతి దిక్కున, అంజనీదేవి వాయువ్య మున, రుద్రాణి (రుద్రపత్ని) ఈశాన్యమున (పార్వతియే కాని రౌద్రగుణవతి యని భావము), బ్రహ్మాణి (సరస్వతి) ఊర్ధ్వదిక్కున, వైష్ణవి క్రింది దిక్కునను. సర్వాంగములను భువనేశ్వరీదేవియు నన్ను కాపాడుగాకయని దశదిశల నుండి రక్షణము కోరబడినది.

మరియు, గాయత్రిలోని ప్రతి అక్షరమునకు ఒక్కొక్క యధిష్ఠాన దేవత చెప్పబడినది కదా. కావున ఆయా అక్షర స్వరూపమైన ఆ యా దేవత తనయంగములను రక్షించు గాక యనియు ప్రార్థన చేయబడుచున్నది.
గాయత్రి యందలి—

తత్ పదము నా పాదములను రక్షించుగాక. సవితుః అనుపదము పిక్కలను, వరేణ్యం నడుమును, భర్గః - నాభిని, దేవస్య-హృదయమును, ధీమహి-గొంతును, ధియః-నేత్రములను, యః - లలాటమును, నః-శిరస్సును, ప్రచోదయాత్ - శిఖను కాపాడు గాక యని పదములను గూర్చి ప్రార్థించి పిమ్మట ప్రతి యక్షరము నుండియు రక్షణ కోరుచున్నాడు.

తత్ అను అక్షరము శిరస్సును, సకారము-ఫాలమును, వివర్ణము-కన్నులను, తు-చెక్కిళ్ళను, వ-నాసికను, రే-ముఖమును, ణి-పై పెదవిని, యం-క్రింది పెదవిని, భర్-నోటిని, గో-గడ్డమును, దే-కంఠమును, వ-భుజములను, స్య-కుడిచేతిని ధీ-ఎడమచేతిని, మ-హృదయమును, హి-పొట్టను, ధి-బొడ్డును, యో-నడుమును, యో - మర్మాంగమును, నః - తొడలను, ప్ర - మోకాళ్ళను, చో-పిక్కలను, ద - సీలమండలను, యా-పాద ములను, త్ - నా సర్వాంగములను ఎల్లప్పుడు కాపాడుచుండు గాక.

ఈ కవచమును పఠించిన సర్వ బాధలు తొలగును. సర్వ పాపములు నశించును. ఇది చతుష్షష్టి కళలను పిమ్మట మోక్షమును ప్రసాదించును. దీనిని చదివినను, విన్నను, గో సహస్ర దాన ఫలము లభించును.

గమనిక : కవచ పఠనమునకు మంత్రమునకు వలె ఉపదేశము నిర్బంధము కాదు. రాత్రులందు కూడ పఠింప వచ్చును. సంఖ్యా నియమము లేదు. ఎన్ని పర్యాయములైనను పఠింపవచ్చును. అయితే అర్థము తెలిసికొని పఠించిన అధికలాభము. ఉచ్చారణయందు లోపము పనికిరాదు. సంస్కృతము రానివారు అది వచ్చిన వానివద్ద పఠించి నిర్దోషత్వమును పాటించవలెను. ఒక్కడే దేవుడు లేక దేవత అనేక రూపములతో అన్ని దిక్కుల నుండి రక్షించు నని భావము.

# గాయత్రీ హృదయము

నారద ఉవాచ :

శ్లో॥ భగవన్ దేవదేవేశ భూత భవ్య జగత్ప్రభో
కవచం చ శ్రుతం దివ్యం గాయత్రీ మంత్ర విగ్రహమ్
అధునా శ్రోతు మిచ్ఛామి గాయత్రీ హృదయం పరమ్

యద్ధారణాద్భవే త్పుణ్యం గాయత్రీ జపతోఽఖిలమ్
నారాయణ ఉవాచ :

శ్లో॥ దేవ్యాశ్చ హృదయం ప్రోక్తం నారదాథర్వణే స్ఫుటం
తదేవాహం ప్రవక్ష్యామి రహస్యాతి రహస్యకం
విరాడ్రూపాం మహాదేవీం గాయత్రీం వేదమాతరం
ధ్యాత్వా, తస్యాస్త్వథాంగేషు ధ్యాయే
దేతాశ్చ దేవతాః
పిండ బ్రహ్మాండయోరైక్యాత్ భావయేత్
స్వతనౌ తథా
దేవీరూపం నిజే దేహే తన్మయత్వాయ సాధకః
నాదేవోఽభ్యర్చయే ద్దేవ మితి వేదవిదో విదుః
తతోఽభేదాయ కాయేస్వే భావయేద్దేవతా ఇమాః
అథ తత్సంప్రవక్ష్యామి తన్మయత్వ మథో భవేత్
గాయత్రీ హృదయస్యాస్యాప్యహమేవఋషిస్స్మృతః
గాయత్రీ ఛంద ఉద్దిష్టం దేవతా పరమేశ్వరీ
పూర్వోక్తేన ప్రకారేణ కుర్యాదంగాని షట్
క్రమాత్
ఆసనే విజనే దేశే, ధ్యాయే దేకాగ్రమానసః॥

అథార్థన్యాసః

ద్యౌర్మూర్ధ్ని దైవతం దంత పంక్తా వశ్వినౌ
ఉభే సంధ్యే చోష్ఠయోః ముఖేఽగ్నిః జిహ్వాయామ్

సరస్వతీ, గ్రీవాయాంతు బృహస్పతిః స్తనయో
ర్వసదోఽస్త్రౌ బాహ్వోర్మరుతః హృదయే పర్జన్యః
ఆకాశముదరే నాభా వంతరిక్షం కట్యోరింద్రాగ్నీ
జఘనే విజ్ఞానఘనః ప్రజాపతిః కైలాసమలయా ఊర్వోః
విశ్వే దేవా జాన్వోః జంఘయోః కౌశికః గుహ్యే అయనే
లింగే పితరః పాదయోః పృథివీ, వనస్పతయోఽంగుళీషు
ఋషయో రోమసు నఖేషు ముహూర్తా అస్థిషు గ్రహాః
అసృఙ్మాంసే ఋతవః సంవత్సరా వై నిమేషే

అహోరాత్రే

జాగర స్వాపయోః నేత్రయో రాదిత్యశ్చంద్రమా
ఏవం రూపాం దివ్యాం గాయత్రీం సహస్రనేత్రాం

శరణ మహం ప్రపద్యే॥

ఓం తత్సవితుర్వరేణ్యాయ నమః, ఓం తత్పూర్వ
జయాయ నమః। తత్ప్రాతరాదిత్య ప్రతిష్ఠాయై నమః। ప్రాత
రధీయానో రాత్రికృతం పాపం నాశయతి। సాయ మధీయానో
దివసకృత పాపం నాశయతి। సాయంప్రాత రధీయానోఽ
పాపో భవతి। సర్వతీర్థేషు స్నాతో భవతి। సర్వైర్దేవైర్జ్ఞాతో
భవతి! అవాచ్య వచనాత్పూతో భవతి। అభక్ష్య భక్షణా
త్పూతో భవతి। అభోజ్య భోజనాత్పూతో భవతి। అచోష్య
చోషణా త్పూతో భవతి! అకృత్యకరణాత్పూతో భవతి।
అసాధ్య సాధనాత్పూతో భవతి। దుష్ప్రతిగ్రహ శతసహస్రా

తూ్పతో భవతి। పంక్తి దూషణాత్పూతో భవతి। అనృత వచనాత్పూతో భవతి। అథాబ్రహ్మచారీ బ్రహ్మచారీ భవతి అనేన హృదయే నాధీతేన క్రతు సహస్రేణేష్టం భవతి। షష్టిశత సహస్ర గాయత్ర్యా జప్యాని ఫలాని భవంతి, అష్టౌ బ్రాహ్మణాన్ సమ్యగ్గ్రాహయిత్వా గాయత్రీరూపాన్ పరితోషయేత్। తస్యసిద్ధిర్భవతి। య ఇదం నిత్య మధీయానో బ్రాహ్మణః ప్రాతశ్శుచిస్సర్వపాపైః ప్రముచ్యతే, స బ్రహ్మ లోకే మహీయతే ఇత్యాహ భగవాన్ నారాయణః.

ఇతి శ్రీ దేవీ భాగవతే ద్వాదశస్కంధే
గాయత్రీ హృదయ కథనం నామ చతుర్థోఽధ్యాయః

# హృదయ వివరణము

శ్రీమన్నారాయణమూర్తిని నారదుడు ప్రార్థింపగా నిట్లు గాయత్రీ హృదయమును బోధించెను.

**నారదా!** శ్రీ గాయత్రీహృదయము అథర్వణ వేదమున స్ఫుటము గానున్నది. దానినే చెప్పెదను. ఇది అతి రహస్యమైనది. విరాడ్రూపయై వేదమాతయైన గాయత్రీ దేవిని తలచుకొని ఆమె అంగములందు రాబోవు దేవతలను అభేదముతో భావింపవలెను. పిమ్మట వానిని తన దేహముతో

నైక్యము భావింపవలెను. పిండాండము (తన దేహము) బ్రహ్మాండము నొక్కటియే గాన దేవీరూపమును తన దేహముతో నైక్యము పొందింపవలెను. తాను దేవతా స్వరూపుడై దేవత నారాధింపవలెనని వేదవేత్తల సిద్ధాంతము. నారుద్రో రుద్రమర్చయేత్ అని రుద్రార్చనలో కలదు. అనగా అరుద్రః=రుద్రుడు కానివాడు, రుద్రం = రుద్రుని, న అర్చయేత్ = ఆరాధింపరాదు, అందుకే అభిషేకమునకు ముందు మహాన్యాసము చేయుదురు దానియందు తన యొక్క ప్రతి అవయమునందు రుద్రావయవములను భావింతురు.



ఈ గాయత్రీ హృదయమునకు (నేను) నారాయణుడు ఋషి, గాయత్రి ఛందస్సు, పరమేశ్వరి దేవత అంగన్యాస కరన్యాసములు కవచములో చెప్పబడిన వానినే అనుసరింపవలెను. దర్భాద్యాసనమున ఏకాంతముగ గూర్చొని ఏకాగ్రమానసుడై యీ క్రింది విధముగ భావింపవలెను.



శిరస్సున స్వర్గమును, పలువరుసయం దశ్విని దేవతలను, పెదవులపై నుభయ సంధ్యలను, ముఖమునం దగ్నిదేవుని, నాలుకయందు సరస్వతిని, కంఠమందు బృహస్పతిని, స్తనములందు అష్టవసువులను, హస్తములందు వాయువును, హృదయముపై పర్జన్యుని (మేఘముల అధిదేవత) గర్భమునం

దాకాశమును, నాభియందు అంతరిక్షమును (భువర్లోకము) నఖమునందు ఇంద్రాగ్నులను, పిరుదులందు బ్రహ్మను, తొడలయందు కైలాస-మలయ పర్వతములను, మోకాళ్ళయందు విశ్వేదేవతలను, పిక్కలయందు కౌశికుని, గుహ్యమున అయనములను. (ఉత్తరదక్షిణాయనములు) లింగమందు పితరులను, పాదములందు పృథివిని, వ్రేళ్ళయందు వనస్పతులను, రోమములందు ఋషులను, గోళ్ళయందు ముహూర్తములను (కాలము) ఎముకలయందు గ్రహములను, (నవగ్రహములు) రక్తమాంసముల యందు ఋతువు (వసంతాదు)లను, రెప్పపాటునందు సంవత్సరములను, జాగ్రత్ స్వప్నావస్థలందు అహోరాత్రములను, నేత్రములందు సూర్య చంద్రులను భావింపవలెను. ఇట్టి దివ్య రూపము గల సహస్ర నేత్రయైన గాయత్రీదేవిని శరణు పొందుచున్నాను. మఱియు తత్సవితుర్వరేణ్యంబునకు, తత్పూర్వాజయునకు, తత్ప్రాతరాదిత్యునకు నమస్కారము. తత్ప్రాతరాదిత్య ప్రతిష్ఠయగు తేజంబునకు నమస్కారమని చెప్పవలెను.

## ఫలము

ఈ గాయత్రీ హృదయమును ప్రాతఃకాలమున పఠించిన రాత్రి చేసిన పాపము నశించును. సాయము పఠించిన పగటి పాపములు నశించును. సాయం ప్రాతః కాలములందు పఠిం

చిన పాప రహితుడగును. సర్వ తీర్థములందు స్నాన మొనర్చి నవాడగును. ఇతనిని దేవతలందరు గుర్తింతురు. అనరానిది అనుట వలన, నమలరానిది నమలుట వలన, తినరానిది తిను టవలన, జుఱ్ఱరానిది జుఱ్ఱుట వలన, చేయరానిది చేయుటవలన సాధింపరానిది సాధించుటవలన ఏయే పాపములు సంక్రమిం చునో వానినుండి విముక్తుడగును. దుర్దానములనేకము పట్టినను పవిత్రుడగును. పంక్తిదూషణము చేయు పాపము కూడ నశించును. అసత్య భాషణ దోషము తొలగును.

బ్రహ్మచింతన లేనివాడు బ్రహ్మ పరాయణుడగును. ఈ గాయత్రీ హృదయ పారాయణము వలన వేయి క్రతు వులు చేసినవాడగును. అరువదిలక్షల గాయత్రీ జప ఫలము వచ్చును. ఎనమండుగురు బ్రాహ్మణులకు కోరిన దానము లిచ్చి వారిని గాయత్రీ రూపముగ నారాధించి తృప్తి పరచ వలెను. అతనికి ఈ హృదయము సిద్ధించును. ఏ బ్రాహ్మ ణుడు శుచియై నిత్యము ప్రాతఃకాలమున పఠించునో అతడు సర్వ పాపముల నుండి విముక్తుడగును. అతడు దేహాంత మున బ్రహ్మలోకము ప్రవేశించునని భగవంతుడైన శ్రీ మన్నారాయణుడు బోధించెను.

ఇది దేవీ భాగవతము ద్వాదశస్కంధమందలి
గాయత్రీ హృదయమను 4 వ అధ్యాయము.

# శ్రీ గాయత్రీ స్తోత్రము

నారద ఉవాచ :

శ్లో॥ భక్తానుకంపిన్ సర్వజ్ఞ హృదయం పాపనాశనమ్
గాయత్ర్యాః కథితం తస్మాద్గాయత్ర్యాః
స్తోత్రమీరయ! 1

నారాయణ ఉవాచ :

శ్లో॥ ఆదిశక్తే జగన్మాతః భక్తానుగ్రహకారిణి
సర్వత్ర వ్యాపికేఽనంతే త్రిసంధ్యే తే
నమోఽస్తుతే॥ 2

త్వమేవ సంధ్యా గాయత్రీ సావిత్రీ చ సరస్వతీ
బ్రాహ్మీ చ వైష్ణవీ రౌద్రీ రక్తా శ్వేతా
సితేతరా! 3

ప్రాతర్బాలా చ మధ్యాహ్నే యౌవనా సా
భవేత్పునః
వృద్ధా సాయం భగవతీ చింత్యతే మునిభి స్సదా। 4

హంసస్థా గరుడారూఢా తథా వృషభ వాహినీ
ఋగ్వేదాధ్యాయినీ భూమౌ దృశ్యతే యా
తపస్విభిః। 5

యజుర్వేదం పఠంతీ చ అంతరిక్షే విరాజతే
సా సామగాపి సర్వేషు భ్రామ్యమాణా తథా భువి 6
రుద్రలోకం గతా త్వం హి విష్ణులోక నివాసినీ
త్వమేవ బ్రహ్మణో లోకే మర్త్యానుగ్రహ కారిణీ 7
సప్తర్షి ప్రీతి జననీ మాయా బహు వరప్రదా
శివయోః కరనేత్రోత్థా హ్యశ్రుస్వేద సముద్భవా 8
ఆనంద జననీ దుర్గా దశధా పరిపఠ్యతే
వరేణ్యా వరదా చైవ వరిష్ఠా వరవర్ణినీ 9
గరిష్ఠా చ వరాహా చ వరారోహా చ సప్తమీ
నీలగంగా తథా సంధ్యా సర్వదా భోగమోక్షదా॥ 10
భాగీరథీ మర్త్యలోకే పాతాళే భోగవత్యపి
త్రిలోక వాహిని దేవీ స్థానత్రయ నివాసినీ 11
భూర్లోకస్థా త్వమేవాసి ధరిత్రీ లోకధారిణీ
భువో లోకే వాయుశక్తిః స్వర్లోకే తేజసాం నిధిః 12
మహర్లోకే మహాసిద్ధిః జనలోకే జనన్యపి
తపస్వినీ తపోలోకే సత్యలోకే తు సత్యవాక్ 13
కమలా విష్ణులోకే చ గాయత్రీ బ్రహ్మలోకగా
రుద్రలోకే స్థితా గౌరీ హరార్ధాంగ నివాసినీ 14
అహమో మహతశ్చైవ ప్రకృతి స్త్వం హి గీయసే
సామ్యావస్థాత్మికా త్వం హి శబల
బ్రహ్మరూపిణీ 15

తతః పరా పరాశక్తిః పరమా త్వం హి గీయసే
ఇచ్ఛాశక్తిః క్రియాశక్తిః జ్ఞానశక్తి స్త్రిశక్తిదా 16
గంగా చ యమునా చైవ విపాశా చ సరస్వతీ
సరయూ దేవికా సింధు ర్నర్మ దైరావతీ తథా 17
గోదావరీ శతద్రూశ్చ కావేరీ దేవలోకగా
కౌశికీ చంద్రభాగా చ వితస్తా చ సరస్వతీ 18
గండకీ తపినీ తోయా గోమతీ వేత్రవత్యపి
ఇడా చ పింగళా చైవ సుషుమ్నా చ తృతీయకా 19
గాంధారీ హస్తజిహ్వా చ పూషా పూషా తథైవ చ
అలంబుసా కుహూశ్చైవ శంఖినీ ప్రాణవాహినీ 20
నాడీ చ త్వం శరీరస్థా గీయసే ప్రాక్తనైర్బుధైః
హృత్పద్మస్థా ప్రాణశక్తిః కంఠస్థా
స్వప్ననాయికా॥ 21

తాలుస్థా త్వం సదాధారా బిందుస్థా బిందుమాలినీ
మూలేతు కుండలీ శక్తిః వ్యాపినీ కేశమూలగా 22

శిఖామధ్యాసనా త్వం హి శిఖాగ్రే తు మనోన్మని
కిమన్య ద్బహునోక్తేన యత్కించి జ్జగతీత్రయే 23
తత్సర్వం త్వం మహాదేవి శ్రియే సంధ్యే నమోఽస్తుతే
ఇతీదం కీర్తితం స్తోత్రం సంధ్యాయాం
బహుపుణ్యదమ్ 24

మహా పాపప్రశమనం మహా సిద్ధివిధాయకం
య ఇదం కీర్తయేత్ స్తోత్రం సంధ్యాకాలే
సమాహితః 25

అపుత్రః ప్రాప్నుయాత్పుత్రం ధనార్థీ ధన
మాప్నుయాత్
సర్వతీర్థ తపోదానం యజ్ఞ యాగ ఫలంలభేత్ 26
భోగాన్ భుక్త్వా చిరం కాల మంతే మోక్ష
మవాప్నుయాత్
తపస్విభిః కృతం స్తోత్రం స్నానకాలే తు యః
పఠేత్ 27

యత్ర యత్ర జలే మగ్నః సంధ్యామజ్జనజం
ఫలమ్
లభతే నాత్ర సందేహ స్సత్యం సత్యం చ నారద! 28
శృణుయా ద్యోపి తద్భక్త్యా స తు పాపాత్ప్ర
ముచ్యతే
పీయూష సదృశం వాక్యం సంధ్యోక్తం
నారదేరితమ్ 29

ఇతి శ్రీ దేవీ భాగవతే
ద్వాదశ స్కంధే గాయత్రీ స్తోత్ర కథనం నామ
పంచమోఽధ్యాయః

## స్తోత్ర సారము

గాయత్రీ హృదయమును గ్రహించి నారదుడు స్తోత్రమును గూడ ననుగ్రహింపుమని వేడగా శ్రీమన్నారాయణు డిట్లు పలికెను.

ఓ ఆదిశక్తీ జగన్మాతా! భక్తుల ననుగ్రహించు దేవీ! నీవు అంతటను వ్యాపించియున్నావు. నీవు సంధ్యాత్రయ స్వరూపిణివి. నీకు నమస్కారము. గాయత్రివి, సావిత్రివి, సరస్వతివి నీవే. బ్రాహ్మి, వైష్ణవి, రౌద్రియు నీవే. నీవు రక్త శ్వేత శుక్ల వర్ణములతో భాసింతువు. నీవు ఉదయము బాలవని, మధ్యాహ్నము యువతివని, సాయమున వృద్ధవని మునులు కీర్తింతురు.

దేవీ! నీవు ఒకపరి హంస నెక్కియు, ఒకపరి గరుడు నెక్కియు, మరొకసారి వృషభారూఢవయ్యు విహరింతువు. (అనగా వాణీ, లక్ష్మి, గౌరీ రూపములు) ఋగ్వేదము పఠించుచు భూమిపై, యజుర్వేదము పఠించుచు అంతరిక్షమున, సామగానము చేయుచు సర్వ లోకములందును సాక్షాత్కరించుచుందువు. ఒకప్పుడు కైలాసమున నివసించిన నీవే మరొకసారి వైకుంఠమున నుందువు. వేరొకప్పుడు బ్రహ్మలోకము చేరుదువు. నీవు సప్త మహర్షులకు ప్రీతి కలిగింతువు మాయా స్వరూపిణివి. వరము లిచ్చుదానవు. ఒకప్పుడు గౌరీ శంకరుల కరముల నుండియు నేత్రముల నుండియు

మనోకప్పుడు వారి యశ్రుస్వేదము నుండియు జన్మించితివి. అనంత జననీ ఓ దుర్గా నిన్ను వరేణ్య వరద, వరిష్ఠ, వర వర్ణిని, గరిష్ఠ, వరాహా, వరారోహా, సిలగంగ, సంధ్య, భోగ మోక్షద అని పది పేర్లతో బిలుతురు.

మర్త్య లోకమున నీవు భాగీరథిగా, పాతాళమున భోగవతిగా విహరింతువు. భూలోకమున నీవు భూదేవి శోకమును పంచుకొందువు. భువర్ లోకమున నివు వాయుశక్తివి, స్వర్లోకమున తేజోనిధివి, మహర్లోకమున మహాసిద్ధివి, జనలోకమున జననివి. తపోలోకమున తపస్విని వి. సత్య లోకమున సత్య వాక్ స్వరూపిణివి.

వైకుంఠమున లక్ష్మివి సత్యలోకమున గాయత్రివి రుద్ర లోకమున గౌరివి. శంకరుని అర్ధాంగమున నివసించునదియు నీవే. అహంకారమునకు మహత్తత్త్వమునకు ప్రకృతివి నీవే. దాని సామ్యావస్థయును నీవే. శబల బ్రహ్మరూపిణివైన పరాశక్తివి ఇచ్ఛాశక్తి క్రియాశక్తి జ్ఞానశక్తి స్వరూపవైన నివు ఆమూడు శక్తుల నొసంగుదువు. గంగాయమునా విపాశాది నదులన్నియు నీరూపమే.

నివు సర్వ శరీరములందు నాడీ రూపముగ నుందువని ప్రాచీన పండితు లందురు. హృదయ పుండరీకమునందుండి

ప్రాణశక్తివై, కంఠమందుండి స్వప్ననాయికవై తాలువు నందుండి సదాధారవైతివి, బిందు నిలయమైన బిందు నాయికవు. మూలాధారమున కుండలినీశక్తివి. కేశమూలము లందుండు వ్యాపినివి శిఖాగ్రమునందుండి మనోన్మనివైతివి. వేయేల చతుర్దశ భువనములందేయే వస్తువు కలదో అది యంతయు నీ రూపమే. తల్లీ సంధ్యాదేవీ! నీకు నమస్సులు.

ఈ స్తోత్రమును సంధ్యా కాలమున పఠించుట వలన మహా పుణ్యము లభించును. మహా పాపములు నశించును. పుత్రులు లేనివారికి పుత్రులు. ధనము లేనివారికి ధనము లభించును. సర్వతీర్థ తపోదాన యజ్ఞకృతములైన పుణ్యములు ప్రాప్తించును. ఇహలోకమున భోగము లనుభవించి అంత మున మోక్షము పొందును. (సంధ్యావందనము చేసియే దీనిని పఠింపవలెను.)

# పురశ్చరణము

## (లేక-పునశ్చరణము)

మన్త్రసిద్ధి కావలెనన్న పురశ్చరణము చేయవలెను. మంత్రమున కెన్ని యక్షరము లుండునో అన్ని లక్షల పర్యాయము నియమ పూర్వకముగ జపము చేసిన యెడల ఆ

మంత్రము సిద్ధించును. అనగా తన్మూలమున పొందదగిన ఇహపర లాభములు ప్రాప్తించును. ఈ విషయము గాయత్రికి కూడ వర్తించును.

శ్లో॥ గాయత్రీచ్ఛందో మంత్రస్య యథా
సంఖ్యాక్షరాణి చ,
తావల్లక్షాణి కర్తవ్యం పురశ్చరణకం తథా॥

గాయత్రీ మంత్రమున కెన్ని యక్షరములో అన్ని లక్షలు జపించుట పురశ్చరణయగును. విశ్వామిత్రుడు మాత్రము దీనికి 32 లక్షల జప మొనర్పవలెనని చెప్పెను 11 స్కం. 21 అధ్యా.

జప సంఖ్యలో పదియవ వంతు క్షీర తర్పణము, దానిలో 10వ వంతు హోమము, దానిలో పదియవవంతు బ్రాహ్మణ భోజనము. హోమము ఆవు నేతితో చేయవలెను. ఇది సాధారణ నియమము. నెయ్యి క్షీరాన్నము. బిల్వ పత్రములు, తిలలు, గడ్డి పరకలు, జిల్లేడు సమిధలు వీనితో హోమము చేయవలెనని దేవీ భాగవతము దెలిపెను. చవితి, షష్ఠి, అష్టమి. నవమి, త్రయోదశి పనికిరావు. తారాబలము, చంద్రబలము మొదలగునవి చూడవలెను. నిత్యము ఒకటే సంఖ్యగా జపించవలెను. ప్రాతః కాలమున సంధ్యా సమాప్తి చేసి మధ్యాహ్నము వరకు జపించవలెను. పురశ్చరణము వలన మంత్రసిద్ధి కలుగును. సమస్త మనో

ర ఫలములు ఫలించును. ఈ విషయమున విశేషముగ తెలియ గోరువారు శ్రీ విద్యా శంకర భారతీ స్వామివారు రచించిన శ్రీ గాయత్రీ కౌముదిని చూడవలెను. సంధ్యా కాలమున గాయత్రిని వ్రేళ్ళ (కణుపుల) పై లెక్కింపవలెను. పురశ్చ రణమున జపమాల గ్రహింపవచ్చును.

# శ్రీ విద్యా గాయత్రి

మంత్రములలో సత్తమోత్తమమైనది. ఇహపర సుఖ సాధనమైనది. వేదత్రయ సారమైనది గాయత్రి యని వేదశాస్త్రము లుగ్గడించినవి. ఇది బ్రాహ్మణులకు పరిమిత మైనచో స్త్రీ-శూద్రులు దీని ప్రయోజనము నుండి వంచితులు కారా? యని సందియము కలుగ వచ్చును. అది భ్రమయే. మన వేద శాస్త్రములు తమ్ము నమ్మిన మానవాళికి ఉపదేశా మృతము పంచి పెట్టినది.

స్త్రీ శూద్రులకు వేదమందధికారము లేనందున వారిని కూడ తరింప జేయుటకు శ్రీ విద్య అవతరించినది. అందు ప్రధానమైనది పంచదశి మంత్రము. అది గాయత్రి స్థానమున అవతరించినది. సూక్ష్మతర గాయత్రి యని వ్యవ హారము కూడ దానికి కలదు. ఇక ప్రణవమును గూర్చి

తర్కించినచో దానిని బ్రాహ్మణులైనను అందరు ఉచ్చరింప నర్హులు కారు. అందుకని శ్రీ విద్యలో ప్రణవమునకు ప్రతి నిధులుగా ఐం హ్రీం శ్రీం క్లీం సౌః అని ఐదక్షరము లేర్ప డినవి. వానిని పంచ ప్రణవము లందురు. వైదిక మంత్రము లకు (ఓం) ప్రణవము చేర్చినటుల శ్రీ విద్యా మంత్రములకు పై చెల్పిన పంచ ప్రణవములలో నొక దానిని చేర్చిరి. అవసరమును బట్టి ఒకటి కంటె ఎక్కువ బీజములు కూడ చేర్చబడినవి. ఐం = వాగ్ బీజము, హ్రీం = మాయా బీజము, శ్రీం = శక్తి బీజము, క్లీం = కామ బీజము, సౌః = (ఇదియు) శక్తి బీజము. హ్రీం బీజమున ప్రకృతి పురుషు లిరువురు నుండుటచే ఓం స్థానమున దీనిని ప్రయోగించుట శ్రేష్ఠము.

పై విషయములను సూచించుటకే దేవీ భాగవతమున మొట్ట మొదటి శ్లోకము గాయత్రివలె 8 అక్షరములు గల మూడు పాదములతో ఆవిర్భవించినది. అది ప్రార్థనాత్మకము

శ్లో॥ సర్వ చైతన్య రూపాన్తా మాద్యాం విద్యాంచ ధీమహి।

బుద్ధిం యా నః ప్రచోదయాత్ ॥

యా = ఏ విద్య, నః = మా యొక్క, బుద్ధిం = బుద్ధి వృత్తిని, ప్రచోదయాత్ = ధర్మ కర్మలను గూర్చి ప్రేరేపించునో, తాం = అటువంటి, సర్వ చైతన్య రూపాం

= అందరియందు చైతన్య రూపముగా నున్న, ఆద్యాం = మొదటి దైన, విద్యాం = జ్ఞాన స్వరూపమును, ధీమహి = ధ్యానించుచున్నాము.

గాయత్రిలోని ముఖ్యాంశమింక గోచరించును. గాయత్రిలో ధ్యానింపబడు వస్తువునకు రెండు విశేషణములు చేర్చబడినవి. "సవితుః దేవస్య వరేణ్యం భర్గః" అను పదములు గాయత్రిలో నుండగా ఇక్కడ "సర్వ చైతన్య రూపాం ఆద్యాం విద్యాం" అని యున్నది. భావము సరిపోవును. సవితుః అనగా జగత్తును సృష్టించునట్టిది. అది జగత్తుకంటె ముందుండవలెను. ఈభావము ఆద్యాం పదముతో వచ్చును. దేవస్య = స్వయం ప్రకాశమానము. ఈ యర్థము విద్యా శబ్దముతో వచ్చును. ఈ విధముగ గాయత్రీ మంత్రార్థము పై మూడు పాదముల ప్రార్థనతో లభించినది. ఇది వైదిక గాయత్రికి ప్రత్యామ్నాయముగ నిలచియున్న పంచదశీ మంత్రమును సూచించుచున్నది.

## సూక్ష్మతర గాయత్రి

క ఏ ఈ ల హ్రీం హ స క హ ల హ్రీం స క ల హ్రీం అను ఈ (15) పంచదశాక్షరికి సూక్ష్మతర గాయత్రి యను వ్యవహారము కలదు.

ఎట్లన :- గాయత్రికి మూడు పాదములు, పంచదశికి హ్రీంతో సమాప్తమైన మూడు కూటములు, మొదటది

వాగ్భవ ఖండము (కూటము) రెండవది కామరాజ ఖండము. మూడవది శక్తి ఖండము. గాయత్రివలె నిదియు మొదటి ఖండము ఋగ్వేద సారము రెండవది యజుర్వేద సారము మూడవది సామవేదసారము. మఱియు నీ మూడు కూటములు త్రిపురములు అనగా జాగ్రత్ స్వప్న సుషుప్తి దశలు. కావున దీని దేవత మహా త్రిపుర సుందరియైనది. ఇది గాయత్రికి రూపాంతరము. గాయత్రీ మంత్రములో- వచ్చిన వర్ణమును వదలివేసి క్రొత్త యక్షరములను మాత్రమే లెక్కించిన 15 అక్షరములు మాత్రమే వచ్చును.

ఎట్లన :- ధీమహి - ధియోయోనః అనుటలో ధి రెండు సార్లు, యో రెండుసార్లు వచ్చినవి. వానిలో ఒక్కొక్క దానిని మాత్రమే లెక్కింపవలెను. ఇట్లు 15 అక్షరములు మాత్రమే ఉండుట పంచదశికి గుప్తముగ నున్న సన్నిహిత సంబంధము. ఇక అర్థములో సమానత్వము చూతము.

## ప్రథమ ఖండము

క = సవితృ దేవత (జగత్సృష్టికర్త) యందు స్థితమై

ఏ = (అ + ఇ) శివ శక్త్యాత్మకమై వరేణ్యమై భర్గః పద వాచ్యమై జ్యోతి స్వరూపముగ ధ్యానింపబడు

హ్రీం = (విద్యయైన, అనగా మహా త్రిపుర సుందరివైన నీవు) మా బుద్ధివృత్తిని

ఈల=(పరంజ్యోతి యందు) ప్రవర్తింపజేయుటకు.

ఈ ఖండమునందు గాయత్రీ మంత్రార్థము ఇమిడియున్నది.

## ద్వితీయ ఖండము

హసక = సర్వగుణాతీతమైన

హ = శబ్దములను

ల = భేదించునది అనగా అందనిది

హ్రీం = పరబ్రహ్మమే

ఈ ఖండము గాయత్రి చతుర్థ పాదమనబడు పరో రజసి సావదోమ్ అను వాక్యము యొక్క అర్థమును బోధించుచున్నది. (రజసి పరః) రజస్సత్త్వతమో గుణముల కతీతమై (ఓం) ప్రణవ స్వరూపమైన శుద్ధ చైతన్యము నన్ను రక్షించుగాక యను నర్థమే ఇచటను చెప్పబడినది.

## మూడవ ఖండము

సకల = స+కల=కళలతో కూడినది - లేక-వాచ్యవాచక రూపమైనది అంతయు

హ్రీం= పరబ్రహ్మ స్వరూపమే.

ఇది గాయత్రికి సారాంశము. ఓం కారమునకు రూపాంతరమే హ్రీం కారమని గుర్తించవలెను.

ఈ పంచదశి ద్వారా భక్తి ప్రపత్తి ప్రజ్ఞలను ఐహికాముష్మిక సుఖములను ప్రార్థించు భావములతో అనేకార్థములు శ్రీ విద్యాంధ్ర భాష్యమున వివరింపబడినవి. మఱియు గాయత్రీ దేవికి త్రిపుర సుందరీ దేవితో అభేదము నిరూపింపబడినది. సంధ్యావందనములో గాయత్రియందు "మా బుద్ధి వృత్తులను ప్రేరేపించు వరేణ్యమైన స్థానమును ధ్యానించుచున్నా"మని స్పష్టముగా నుండుటచే దానికి స్పష్ట గాయత్రి యనియు, ఆ భావమే క ఏ ఈ ల హ్రీం అను వర్ణములచే గూఢముగ దెల్పుటచే దీనికి సూక్ష్మతర గాయత్రి యను పేరు వచ్చినది.

# గాయత్రి-శాంతి కర్మలు

గాయత్రీ మంత్రముతో చేయదగిన కొన్ని శాంతి కర్మలు దేవీ భాగవతము 11 వ స్కంధములోని 24 వ అధ్యాయములో చెప్పబడినవి. వానిలో కొన్ని ముఖ్యమైనవి వ్రాయుచున్నాను. ఇవి పారాయణమునకు చెందిన శ్లోకములు కానందున వానిని వదలివేసి తాత్పర్యము మాత్రమే వ్రాయుచున్నాను.

గ్రహములు రోగములు అభిచారములు మొదలైనవాని వలన కలిగెడి బాధలు నివారించుటకు గాయత్రీ జప హోమాదులు విధింపబడినవి. హోమ సంఖ్య లేనిచో వెయ్యి చేయవలెననియు, సమిధలు చెప్పనిచో పలాశ (మోదుగ) సమిధ లుపయోగింపవలెననియు గ్రహింపవలెను. ఇందుకు ప్రమాణము :—

శ్లో॥ అనుక్త సంఖ్యయో స్సంఖ్యా సహస్రం
జపహోమయోః।
పలాశ సమిధోఽనుక్తే
నీలకంఠవిరచిత తిలకవ్యాఖ్యానమ్.

## భూత-రోగ-గ్రహ బాధలకు శాంతి

1) దేశకాల సంకీర్తనముతో సంకల్పముచేసి జమ్మి సమిధలను ఆవు పాలతో తడిపి గాయత్రీ మంత్రముతో వేయిసార్లు హోమము చేయవలెను.

లేదా

పాలచెట్లు అనగా రావి, మేడి, జువ్వి, మఱ్ఱి వీనిలో నేదియైనను సరియే పచ్చి సమిధలు లేక ముక్కలతో నైనను వేయిసార్లు హోమము చేయవలెను.

2) మోకాటి బంటి నీళ్ళలో నిలువబడి గాయత్రిని వేయిసార్లు జపించిన యెడల అన్ని దోషములు నశించును.

3) ప్రాణాంతకమైన భయము కలిగినపుడు గొంతులోతు నీళ్ళలో నిలువబడి వేయిమార్లు జపించిన ఆ భయము తొలగును.

హోమములు చేసిన స్థలమునందే వెయ్యి పర్యాయములు గాయత్రీ మంత్రముతో "సూర్యం తర్పయామి నమః" అను వాక్యమును చేర్చి తర్పణము చేయవలెను.

పై దెల్పిన విధులన్నిటికంటె నీటిలో నిలువబడి చేయు జపము శ్రేష్ఠమైనది.

పై దెల్పిన విధానము లన్నియు ఎడతెగక 49 రోజులు జరుపవలెను.

4) బంగారము-వెండి-రాగి-మట్టి వీనిలో నేదో యొక పాత్రలో గాని రావి, మర్రి, మేడి, జువ్వి వీనిలోనేదైన ముడిలేని చెక్కతో జేసిన పాత్రలో గాని పంచగవ్యము లుంచవలెను. దానిని పైదెల్పిన క్షీరవృక్ష (రావి మర్రి మేడి జువ్వి) పు సమిధలతో జేర్చి వేయి మారులు గాయత్రితో హోమము చేయవలెను.

అచటనే వేయిమారులు గాయత్రితో సూర్యం తర్పయామినమః అను వాక్యము చేర్చి తర్పణము చేయవలెను. హోమము చేయునపుడు ప్రతిసారి పంచగవ్యమును తాకుచుండవలెను. హోమము పూర్తియైన పిదప పాత్రలోనున్న పంచగవ్యమును వేయిమారులు గాయత్రితో అభి

మంత్రించి దానిని ఆ ప్రదేశమున దర్భలతో చల్లవలెను. ఆ ప్రదేశములో భూత బలిని కూడ ఉంచవలెను. ఈ ప్రక్రియవలన ఆభిచారిక కృత్య నశించును. ఈ విధముగ దేవ భూత పిశాచాదులను వశపరచుకొను నెడల అతని గృహము గ్రామము మండలము రాష్ట్రము కూడ భూత ప్రేత పిశాచముల నుండి విముక్తమగును.

5) శనివారమునాడు రావి చెట్టును తాకి నూరుసార్లు జపించుటయు గ్రహదోష నివారణకు మంచిది.

6) (గుడూచి) తిప్పతీగె కణుపుల వరకు నరికిన సమిధలను ఆవుపాలతో తడిపి హోమము చేయుట మృత్యుంజయ హోమము. దీనివలన సర్వ వ్యాధులు నశించును. మంత్రము గాయత్రి, సంఖ్య సహస్రము.

7) జ్వరము నివారించుటకు మామిడాకులను పాలలో ముంచి హోమము చేయవలెను.

8) క్షయవ్యాధి నివారించుటకు మధుత్రితయముతో హోమము చేయవలెను (పాలు - పెరుగు - నేయి) లేదా—

9) పాయసాన్నమును హోమము చేసి మిగిలినది సూర్యునకు నివేదించి క్షయ గ్రస్తునిచే తినిపించవలెను. (రోజులు 49, మంత్రము గాయత్రి, హోమ సంఖ్య సహస్రము.) లేదా

10) సోమలతను కణుపుల వరకు తుంచి సమిధలు చేసి పాలలో ముంచి అమావాస్యనాడు హోమము చేయవలెను.

11. శంఖ పుష్పముల హోమము కుష్ఠువ్యాధిని నివారించును.

12. క్షీర వృక్షపు సమిధలతో హోమమొనర్చిన ఉన్మాదము నశించును.

13. తేనె లేదా చెరకు రసముతో హోమము వలన ప్రమేహము శాంతించును.

14. మధుత్రితయము లేక ఆవాలు హోమము చేసిన మసూచికను హరించును.

15. ఏ దిక్కు నుండి అగ్నివాయువులవలన భీతికలుగునో ఆ దిక్కునందు నూరుసార్లు గాయత్రితో అభిమంత్రించిన మట్టి పెళ్లలను నేలపై గొట్టవలెను.

16. బంధనము కలిగినపుడు గాయత్రిని మనసుతో జపించిన విముక్తుడగును.

17. అభిమంత్రించిన జలము త్రాగిన భూత భయము నశించును.

18. గ్రహ దోషము కలిగిన వానికి భస్మము నూరుసార్లు మంత్రించి ధరింపజేయవలెను.

19. ధన సంపద గోరువాడు రక్త పద్మములతో గాని క్రొం గ్రొత్త జాతి పుష్పములతో గాని బియ్యముతో గాని మారేడు సమిథలు-పత్రములు-వేరు ముక్కలతో గాని హోమము చేయవలెను.

20. త్రిమధురములతో కలిపిన పేలాలను హోమము చేసిన యెడల వధువునకు వరుడు, వరునకు వధువు లభించును (శ్లో॥ 42)

21. నూరు ఎఱ్ఱకలువలను వారం రోజులు హోమంచేసిన యెడల బంగారము లభించును.

22. సూర్య బింబము నుద్దేశించి వేయిమారులు 49 రోజులు వరుసగా జలతర్పణము చేసిన యెడల నీటిలో మరుగుపడియున్న బంగారమును పొందును.

23. పై విధముగ ధాన్య హోమం చేసిన ధాన్యము అన్న హోమం చేసిన అన్నము లభించును.

24. క్షీర వృక్ష సమిధలతో హోమము చేయుట వలన ఉన్మాదము సైతము నశించును.

25. పాయసాన్నమును హోమము చేసి మిగిలిన సూర్యునకు నివేదించి దానినిఋతుస్నాతచే (వెలుపల నున్న ఐదవ రోజు) భుజింపజేసిన యెడల ఆమెకు పుత్ర సంతానము కలుగును. (హోమము వెయ్యి 49 రోజులు)

26 బంగరు మొగ్గలనుహోమము చేసిన శతాయుష్యము లభించును.

27 గడ్డిపరకలను పాలు–నేయి–తేనెలలో నొకదానితో తడిపి నూరు చొప్పున వారంరోజులు హోమం చేయవలెను. పిమ్మటమఱ్ఱిసమిధలతో నొకవారము పాయసముతో నొకవారము నూరు చొప్పున హోమం చేయవలెను. దీనితో అపమృత్యువు తొలగును.

28 పాలు మాత్రమే సేవించుచు ఏడుదినములు సహస్రి గాయత్రి జపించిన యెడల మృత్యుభయము తొలగును.

29 మారేడుచెట్టు క్రింద మాసము రోజులు జపము చేయుట, దాని వేరు, పండ్లు, చిగురుటాకుల హోమముచేయుట వీనివలన రాజ్యము లభించును. అనగా తాను కోరిన పదవి ప్రాప్తించునని యెఱుంగవలెను.

30 యుద్ధప్రారంభమున రావి సమిధలను, హోమము చేసిన జయము కలుగును. జిల్లేడు పుల్లలతో హోమమొనర్చిన అంతటను జయము పొందును.

31 నీటిప్రబ్బలి యాకులను గాని పూలనుగాని పాలతో జేర్చి నూరుసార్లు వారంరోజులు హోమం చేసిన వర్షము కురియును. బొడ్డులోతు నీటిలో నిలువబడి వారం రోజులు జప మొనర్చిన వర్షము కురియును.

32 నీటియందు నూరు పర్యాయములు భస్మహోమము చేసినచో వర్షము ఆగిపోవును.

గమనిక :- బ్రాహ్మణుడు మరియొకరిని గూర్చి జప హోమాదు లొనర్చినను అతనికి ఫలము చేకూరును.

## ద్రవ్యభేదమున ఫలభేదము

అ. పలాశ (మోదుగ) సమిధల హోమముచేత బ్రహ్మ వర్చస్సు

ఆ. మోదుగ పూలహోమముచేత అభీష్టసిద్ధి

ఇ. పాలహోమముచేత మేధస్సు (తెలివితేటలు)

ఈ. పుష్పహోమముచే అటువంటి దారముల వస్త్రము

ఉ. తేనెతో కలిపిన ఉప్పుహోమము వలన అభీష్టము ప్రాప్తించును.

## ఋషిత్వ-దేవత్వ-త్రికాలజ్ఞత్వాదులకు

33 ఒంటికాలిపై నిలువబడి చేతులు పైకెత్తి ప్రాణవాయువును నిరోధించి ఏయాధారము లేక ఒక సంవత్సరము జప మొనర్చిన ఋషిత్వము కలుగును. రాత్రిపూట హావిష్యము భుజింపవచ్చును.

34 పై దెల్పినటుల రెండు సంవత్సరము లాచరించెనేని అతని నోటినుండి వెలువడిన మాటలు జరిగితీరును.

35 అటులనే మూడేండ్లు చేసినచో త్రికాలజ్ఞుడగును.
36 నాలుగేండ్లు జరిపినయెడల భగవంతుడు దిగివచ్చును.
37 ఐదేండ్లు చేసినచో అణిమాది సిద్ధులు కలుగును.
38 ఆరేండ్లాచరించిన కామరూపధరత్వము ప్రాప్తించును
39 ఏడేండ్లాచరించిన దేహాంతమున దేవత్వము లభించును
40 తొమ్మిదేండ్లాచరించిన మనుత్వము కలుగును.
41 పదేండ్లాచరించిన ఇంద్రత్వము ప్రాప్తించును.
42 పదునొకండేండ్లాచరించిన ప్రజాపతిత్వము వచ్చును.
43 పండ్రెండేండ్లాచరించిన బ్రహ్మత్వము లభించును.
నారదాదులిట్లాచరించియే మహిమోపేతులైరి.

## ఆహార భేదములు

కొందరు కూరలను (పచ్చివి) కొందరు మూలము (వేరు) లను, మరికొందరు ఫలములను, కొందరు పాలను కొందరు నేతిని, కొందరు సోమరసమును, కొందరు చరువు (హోమద్రవ్యము) ను ఆహారముగ గైకొనిరి.

## పంచమహాపాప నివారణము

44 స్వర్ణస్తేయ-సురాపాన-గురుతల్పగమన-బ్రహ్మహత్య లనెడు మహాపాపము లొనర్చినవారు ప్రతిదినము మూడువేలవంతున నెలదినములు జపము చేసిన ఆ పాపము నశించును. ఇందు బ్రహ్మహంతకుడు మాత్రము ఆ నెలరోజులు అడవిలో గుడిసె వేసికొని

అక్కడ నివసింపవలెను. ఈ నల్వురితో సహవాస మొనర్చినవాడు ఐదవవాడు. వానికిని ఇదే కర్తవ్య మని ఊహింపవచ్చును. ఈ నెల రోజులు వీరు మౌనము పాటించి ప్రాణాయామ మొనర్పవలెను.

45 రాజు పరిశుద్ధుడగుటకు నెలరోజులు సహస్రజపము చేయవలెను.

46 ద్విజుడు గోవధ పాపము పోగొట్టుకొనుటకు పన్నెండు దినములు మూడువేల చొప్పున జపము చేయవలెను.

47 అన్నివిధములైన పాపములు నశించుటకు వనవాసము చేయుచు నెలదినములు సహస్రగాయత్రి చేయవలెను.

48 మూడువేల జపము ఉపవాసముతో సమానము.
24 వేల జపము కృచ్ఛ్రవ్రతముతో సమానము.
64 వేల జపము చాంద్రాయణ వ్రతముతో సమానము.

మానవుడు నిత్యనైమిత్తిక కామ్య కర్మలాచరించిన భుక్తిముక్తులు లభించును. ఆచరణయే ప్రథమ ధర్మము. ధర్మమునకు యజమానురాలు పరమేశ్వరి. ఆచరణశీలుడెల్లప్పుడు పవిత్రుడు. అతడే సుఖవంతుడు. ఆచారవంతుడే ధన్యజీవి. ఇది ముమ్మాటికి సత్యమని శ్రీమన్నారాయణుడు నారదున కుపదేశించెను.

ఇది శ్రీమద్దేవీ భాగవతమున
ఏకాదశస్కంధములోని సదాచార నిరూపణమను
ఇరువదినాల్గవ అధ్యాయము సమాప్తము

# గాయత్రీ సహస్రనామ స్తోత్రమ్

నారదః :

శ్లో॥ భగవన్ సర్వధర్మజ్ఞ సర్వశాస్త్రవిశారద
శ్రుతిస్మృతిపురాణానాం రహస్యం త్వన్ముఖాచ్ఛ్రుతం
2 సర్వపాపహరం దేవ యేన విద్యా ప్రవర్తతే
కేన వా బ్రహ్మవిజ్ఞానం కిం తు వా మోక్షసాధనమ్
3 బ్రాహ్మణానాం గతిః కేన కేన వా మృత్యునాశనమ్
ఐహికాముష్మికఫలం కేన వా పద్మలోచన
4 వక్తుమర్హస్యశేషేణ సర్వం నిఖిల మాదితః

శ్రీ నారాయణః :

సాధు సాధు మహాప్రాజ్ఞ సమ్యక్ పృష్టం త్వయానఘ
5 శృణు వక్ష్యామి యత్నేన గాయత్ర్యష్ట సహస్రకమ్
నామ్నాం శుభానాం దివ్యానాం సర్వపాప వినాశనమ్
6 సృష్ట్యాదౌ యద్భగవతా పూర్వం ప్రోక్తం బ్రవీమి తే
అష్టోత్తర సహస్రస్య ఋషిర్బ్రహ్మా ప్రకీర్తితః
7 ఛందోఽనుష్టుప్ తథా దేవీ గాయత్రీ దేవతా స్మృతా
హలో బీజాని తస్యైవ స్వరాః శక్తయ ఈరితాః
8 అంగన్యాస కరన్యాసా వుచ్యేతే మాతృకాక్షరైః
అథ ధ్యానం ప్రవక్ష్యామి సాధకానాం హితాయవై

9 రక్త శ్వేత హిరణ్య నీలధవళై ర్యుక్తాం త్రిణేత్రోజ్జ్వలామ్
రక్తాం రక్తమవస్రజం మణిగణైర్యుక్తాం కుమారీమిమామ్
గాయత్రీం కమలాసనాం కరతల వ్యానద్ధ కుండాంబుజామ్
పద్మాక్షీంచ వరస్రజం చ దధతీం హంసాధిరూఢాం భజే
10 అచింత్య లక్షణావ్యక్తాప్యర్థమాతృమహేశ్వరీ
అమృతార్ణవ మధ్యస్థా ప్యజితా చా పరాజితా
11 అణిమాది గుణాధారా ప్యర్కమండల సంస్థితా
అజరాజాపరాధర్మా అక్షసూత్ర ధరాఽధరా
12 అకారాది క్షకారాంతా ప్యరిషడ్వర్గ భేదినీ
అంజనాద్రి ప్రతీకాశా ప్యంజనాద్రి నివాసిని
13 అదితిశ్చాజపావిద్యా ప్యరవింద నిభేక్షణా
అంతర్బహిః స్థితాఽవిద్యాధ్వంసిని చాంతరాత్మికా
14 అజాచాజముఖావాసా ప్యరవింద నిభ నవా
అర్థమాత్రార్థదానజ్ఞా ప్యరిమండలమర్దినీ
15 అసురఘ్నీహ్యమావాస్యా ప్యలక్ష్మీఘ్న్యంత్యజార్చితా
ఆదిలక్ష్మీశ్చాదిశక్తి రాకృతిశ్చాయతాననా
16 ఆదిత్య పదవీచారా ప్యాదిత్య పరిసేవితా
ఆచార్యావర్తనాచారా ప్యాదిమూర్తి నివాసినీ

